# గృహలక్ష్మి




# GRIHALAKSHMI

15th JULY 1955

Vol. No. 24 No. 7

As. 6

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలు, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమ రోగము, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీమర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0    6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0    6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

బాలింతలేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.**

**తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు**

**సీతారాంజనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు**




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8 0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొ అకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు: మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్, పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. వున్నయ్య

సంపుటము ౨౮] జూలై 1955 [సంచిక ౭

# విషయసూచిక





కీ॥ శే॥ బాలాంత్రపు శేషమ్మగారు




జయజయ గృహలక్ష్మి సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## కీ॥ శే॥ బాలాంత్రపు శేషమ్మగారు

పండు పండిన వయోవృద్ధురాలు - నిర్విరామంగా మహిళా పురోభివృద్ధినుద్దేశించి "హిందూ సుందరి" పత్రికా నిర్వహణము నెరపి అభ్యుదయాన్ని కనులారగాంచి సంతుష్టి చెందిన త్యాగశీల శ్రీమతి శేషమ్మగారు.

ఉత్తమ పత్రికా రచయితగా గృహలక్ష్మి స్వర్ణకంకణము నందుకొనిన నారీమణి ఆమె. ఆమె విద్యా విజ్ఞానాలు, సహాయ సహకారాలు, సేవాసక్తి మహిళా ఉద్యమ వ్యాప్తికి విశేషంగా నుపకరించినవి. ఆమె పరమపదించడం ముఖ్యంగా ఆంధ్రనారీ లోకానికి తీరని సంతాపమునకు కారణమయినా శ్రీమతి శేషమ్మగారు శ్రమ, ప్రయాసలను యిహంలో వదిలేసి విశ్రాంతి సౌఖ్యాల నన్వేషిస్తూ పరలోకమున కేగిన సందర్భమున భగవత్సాన్నిధ్యమున నవి అమరగలవని నమ్ముచున్నాము.

శ్రీమతి శేషమ్మగారు పరలోక వాసియైనా ఆమె ఆశయలక్ష్యాలు ఆంధ్ర దేశంలో మహిళాభ్యుదయానికి మార్గదర్శకముగా నుంటూ యుండగలవు.

ఆమె నిర్యాణ సందర్భమున విచారగ్రస్తులైన బంధుమిత్రులకు మా సానుభూతి సంతాపముల తెలియజేయుచున్నాము.

# ర తీ వి లా ప ము

శ్రీ చింతగుంట సుబ్బారావు

---

ప్రాణేశా! నను నొంటిఁ జేసి చన నీ ప్రాణంబు లెట్లొప్పె? నా
ప్రాణంబుల్ క్షతసేతుబంధన జలంబైనట్టి పద్మమ్ములై
రాణింజెందక నాశమా మునుపె చేగన్ రావదేలా సఖా?
ప్రాణంబుల్ త్వదధీనముల్ గద! నిల్వంజాలనే నొంటిమై.

నీకేమేన్ బ్రతికూలమైతినో! ప్రియా నేరంబు నేరన్ సుమా!
నాకేలా కనరావహో ప్రియతమా! నన్నిట్లు వేపంగముల్
నేకేళిన్ మొలనూలఁ గట్టినదియో, నీలోత్పలోత్తాడనం
బో కాకెద్దియొ యెంచి నన్నిటువలెన్ బోనాడఁగా నేర్చితో!

ఎమ్మెకాంద్రకెల్ల నేమేను సాటియో
అట్టి నీ శరీర మగ్గి బడినఁ
దుత్తునియలు కాక దోగు చుంటి నిచట;
ఎంతకఠిను లౌర యెంచ స్త్రీలు!

నా యెదలోనఁగాపురము నాతిరొ నీకని చెప్పియుండ మనో
నాయక నన్ను వీడి చన న్యాయమె నీకు? ననఙ్గ నీ హృదిన్
బాయక నిల్తునన్న ప్రియభాషలు నిక్కువమేని కాపురం
బేయెడనుండు దాన నిపుడీ విధి నన్ను నొకర్తుఁ జేసినన్?

నన్ను గూర్చిన వ్యథ నా కంతగా లేదు,
సహగమన మొనర్తు సంగడీఁడ;
నీవులేని కతన నెల్ల లోకస్థుల
సుఖము దొలఁగునంచు సుంతవగతు.

గాఢతిమిరావగుణ్ఠిత కాళరాత్రి
ఘనఘనాఘన శబ్దవిక్లబులఁ బ్రియల
కాంతుల కవుంగిలిదగుప్పగా నెవండు
నీవు కాక సమర్థుడో నీరజాక్ష!?

నడలలో నుడులలో తడఁబడఁ జేయుచున్
చెలువ కనుల సుడియఁ జేయునట్టి
వారుణీమదంబు, పంచశరస్మరా,
నీవులేని కతన నిష్ఫలంబు!

శంబరారి! నీదు శారీర మిట్లుక
భావశిష్టమని యెఱింగితా నుడుపతి
కృష్ణపక్షము గతియించినంగాని త్య
జించు నెట్లొ కడను, జీర్ణమాట.

అగ్గిఁబడి బుగ్గియై పోతివకట! యింక,
హరితరాగ బంధనమై తనర్చుచుండు
కోకిలకలవాక్సూచిత కోసులంబు
బాల సాలప్రసవ మేరి బాణమౌను?

వింటి టంకారమై చాల వీగినట్టి
భ్రమరఝంకార మిత్తరి, భావజాండ,
యిట్లు గురుశోక భరమైన యీదు సకియ
తోడ హాహావమ్ములై తోచుచుండె.

ప్రాణనాథ! మగుడ రాజీవిరాజితా
దేహమొందిలేచి, తేనెలొలుకఁ
బాడు పికముఁ బిల్చి ప్రాణిలోకమునకు
దూతఁ జేయుమయ్యా రతిపదముల

పాదసరోజ యుగ్మముల మాటికి నంటి వచించు పల్కులన్,
ఆదర మొప్ప నక్కున నసాలనఁ జేసిన కౌఁగిలింతలన్

వేదనఁ బెంపు సేయు, నవి వేపును నన్ను, స్మరా! తలంచినన్
వేదనఁ జెందు వేళ గతియించిన వెల్లను మోదముల్ గదా!

సురతపండిత! నీచేత సొంపుమీర
చేయఁబడినట్టి పూలకై సేఁతదక్కఁ
గాని, కైసేఁతఁ జేసిన కాయమిపుడు
కానరాదహో! నేనేమి కాంచుమనెద?

రమ్ము! రారమ్ము! వేవేగరమ్ము! నాథ!
క్రూరకర్ములౌ సురలు నిన్ గోరిపిల్వ
సగము రచియించివిడిన ప్రసాధనమ్ముఁ
బూర్తిచేయగ వేరమ్ము పుష్పధనుఁడ!

అగ్నిలోఁబడి, నిను నచ్చరస్త్రీలట
స్వర్గమందు వలచివలఁ దగుల్చు
మున్నె, నీదు అంకమునఁ జేరుదాన నో
మదన! నిన్నుఁ బాసి మనగఁ దరమె?

నిన్ననుగమింతునన్నైన, "నిముసమేని
మననుకాపతిఁ బాసి రమణి!" యటంచు
లోకులాడెడు పల్కులు లోకమందు
స్థిరముగా నిల్చు మచ్చయై సిద్ధముగను.

ప్రాణములతోడ నశియించె, ప్రాణనాథ!
అంత్యమండనమేరీతి నంగములకుఁ
జేయుదాననో చిత్తజ, చెప్పుమీవె.

అంకనిషణ్ణ ధన్వుఁడయి అస్త్రమువక్రతఁ బాపుచున్ వెడన్
అంకురమైన చిర్నగవు లందముఁగూర్పగ మోముఁ దమ్మికిన్
శంకయొకింతలేకయె వసంతుని తోడుత ముచ్చడించుచున్
అంకనిషణ్ణనైన ననుపాంత్తవిలోకనచేష్టఁ జూడవే!
కుసుమాయోజిత కార్ముకుండు మధుఁడే కోనన్ గలండోకదా!
విసమున్ మ్రింగిన కాలకంఠుని రుషావీక్ష ప్రసారంబునన్
కుసుమాస్త్రుఁగతి నెంచి నెమ్మి గురుశోకోద్దగ్ధుఁడై పోయెనా!?
పశునాథుండిటు నేత్రజాగ్ని నతనిన్ మండించెనా కోపియై!?

దిగ్ధశరముల వోలు నద్దేవిపల్కు
హృదయమందున గాఢఁగా మదన సఖుఁడు,
హృదయవేదనఁ బాపగా నెదఁదలంచి,
దర్శన మొసంగెఁ దా మన్మథసతి రతికి.

వచ్చి నిలువఁబడినవాని నాలోకించి
పచ్చవిలుతు సకియ పరితపించె,
గుండె బాదుకొనుచు గోడుగోడున నేడ్చె;
బందునెదుట విచ్చుడెంద మెపుడు.

పావురమును బోలి పలువన్నెలీను నీ
చెలుని భస్మమిదిగో! చిమ్మివైచు
చుండె గాలి దాని! చూడుమయ్య వసంత!
ఇంక నెక్కడి చెలి? యెట్లుమనెద?

నీదు దర్శన భాగ్యము నెమ్మిఁ గోరి
మాధవుండుత్సుకుండయ్యె మైత్రికలిమి;
దయితలందు నిల్కడలేనిదైనఁ బ్రేమ
సుహృదులందు నిక్కమ్ముగా సుస్థిరంబు!

మాధవు కతననేకా సుమనస, దైత్య
లోకముల్ నీదువింటికి లొంగుటెల్ల?
అట్టి మిత్రు వసంతునికైన దర్శ
నమ్ము నీకంటతగునె మనసిజ? చూడ.

గాలితాకున నాఱిన జ్వాలవోలె
నీదు చెలికాఁడు పోయెనో మాధవుండ!
మరలిరాడింక; నిజము; నేమాత్రమిట్లు
దీపమాఱిన వెన్క వత్తివలె దుఃఖ
ధూమితనగుచుఁ గన్నీట దోగుచుంటి!

కాముపధియించి విధినన్నుఁ గాచునెట్లు?
అర్ధమానముచేత సర్వమ్ముఁ గొనియె!
సంశ్రయద్రుమ భగ్నంబు ఆశ్రితలతఁ
గూల్చుకొనకకాదె, వసంత! కోవిదుండ!

బంధువీవాట చితఁబేర్చి, పవనుఁబంపి
భర్తచెంతకు నన్నిప్డు పంపుమయ్య ;
చంద్రుతోడనె చంద్రిక చనుటలేదె ?
మేఘు డేఁగఁగ వెనువెంట మెఱుపుఁజనదె ?

ప్రియశరీర భస్మముతోఁ గషాయితనయి,
లేజివురుపాన్పుపై శయనించినట్లు,
ప్రియముగా నగ్నిలోన నా కాయముంతు.

అంజలి ఘటించి వేఁడెదనయ్య సౌమ్య,
పూలపాను పమర్చితి వలపలుమఱు,
అట్టినీవె సొదనమర్చు మనఘ నేఁడు ;
నన్నుఁబాసి నిముసమేని మనగలేడు
మదనుడంచు నెఱుక కాదె మదనసఖుడ ?

ఇట్లొనర్చినమీదట నిర్వురకును
ఒక్కటే జలాంజలినిమ్ము ; నిక్కముగను
కలసిత్రావుట నీ చెలికానిప్రీతి ;
పిండములిడు వేళ, వసంత, మెండుగ నిడు
క్రొంజివురు మావిపూలఁదాఁగోరు సఖుఁడు.

[కాళిదాసకృత కుమార సంభవ కావ్యము లోని రతీవిలాప ఘట్టమునకు స్వేచ్ఛానువాదము.]

---

# చిత్రకారిణి

కుమారి శిరిపురపు జిజియ

చిత్రించిన చిత్రం సిద్ధాంతం
వక్రించిన రేఖల రాద్ధాంతం
భవభరమా చిత్రకారిణీ!
భావమేమిటో రాగరాగి !

మనసున రేగిన మమతల సత్యం
మమతలు పొందిన మానస లక్ష్యం
దాచిన దాగే వెంత కాలమో!
బెదరు చూపులకు అంత్యమెప్పుడో

చిత్రకారిణీ చిద్విలాసినీ
చిత్రించిన చిత్రాలకి ఆవేశం
ఎక్కడిదో !

ఆనందం రంగరించి
అనురాగం మేళవించి
విరిసిన సుమమకరందం
ముద్దజేసి మూర్తి జేసి
జీవాలను పోశావా !

వీచేగాలుల విరహగీతికలు
మనసున మెదిలే ఉత్కంఠదీపికలు
అవిగవిగో నీ చిత్రపు చిత్రంలో
అడుగంటిన ఆశల అంచులలో
తొంగి చూచు తొలకరి మిడతలు
రజనీ రంజన మిటారి నడకలు

నీ జీవితమే ధన్యతమం
నీ బ్రతుకే మధురతరం
మనసులోని భావాలకి
రూపురేఖ లందించే
నీబ్రతుకే రాగమయం
నీ జన్మే రాగలయం

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## సూక్ష్మ శరీరము

ఇంతకుముందు స్థూల దివ్య శరీర నిర్మాణమును వివరించుటలో పంచకోశముల వివరమును గమనించి యున్నాము. వీటిని విచారణ సౌకర్యమునకై స్థూల, సూక్ష్మ, కారణ శరీరములని మూడు రీతుల విభజించి యున్నారు. అన్నమయ, ప్రాణమయ కోశములు కలసి, స్థూలశరీరముగను, మనోమయ విజ్ఞానమయ కోశములు చేరి సూక్ష్మశరీరముగను, ఆనందమయ కోశమును కారణశరీరముగను విభజించియున్నారు. వీటి అన్నిట్లో, సూక్ష్మశరీర సహాయమువల్లనే సాధకులు ఆత్మోద్ధారము పొందుచున్నారు. అన్ని మతములందును, ఈ సూక్ష్మశరీర నాశమును పొందుటనే ముఖ్య ఉద్దేశంగా కలిగియున్నవి. ప్రతిపూజా విధానములలోను, ఈ సూక్ష్మ శరీరమును శక్తివంతము గావించి, వీటి నిర్మాణమునే మార్చ ప్రయత్నించు రీతులు తెలియుచున్నవి.

ఈ ఆవరణమునందుగల శాస్త్రీయ నిర్మాణములను తెలుసుకొనుటకు, ఈ సూక్ష్మ శరీరముయొక్క నిర్మాణమును, స్వభావమును చక్కగ తెలిసియుండవలెను. వేదాంతమున మనసును, బుద్ధిని ఒకటిగా లెక్కించుచున్నారు. ఏలన, విషయము ఒకటియే అయినను, మనము అనుమాన స్థితిలో నున్నప్పుడు మనోకోశమనియు, పూర్వ అనుభవములను, జ్ఞానమునుబట్టి ఒక నిశ్చిత తీర్మానమునకు రాగలిగినప్పుడు విజ్ఞాన కోశములో యున్నామని చెప్పబడుచున్నది.

కనుక ఈ సూక్ష్మ శరీరము అనగా మనసు అని తెలిసిన యెడల, ఈ మనసుయొక్క పూర్ణ స్వభావమును తెలుసుకొనిన యడల సూక్ష్మ శరీర జ్ఞానము పూర్తిగ తెలిసినట్లగుచున్నది.

మిత్రులారా ! మీలో మనసు అనునది యొకటి పనిచేయుచుండుట మీ కందరికిని తెలిసిన విషయము. "నా మనసు భ్రమచెందియున్నది." "నా మనసు ఆందోళనముగా యున్నది." "నా మనసు చెడిపోయినది" అని మీరు తరచుగా తెలుపుచుందురు. కాని, ఈ మనసు అనునదియేమిటో మీరు ఆలోచించినారా? ఇప్పుడు మీ రందరు ఉపన్యాసకుడు పలుకు మాటలు ఆదరభావముతో కేవలము వినుటమాని, స్వయముగా మీకు మీరే ఆలోచించవలెనని కోరుచున్నాను. వాస్తవముగా ఇదియే ఉన్నత ధ్యానము. మీరు ప్రతియొక్కరును ఈ సర్వ సాధారణమైన మనసు అనునది యేమిటో, దాని విషయమును నాకు తెలిపి సహాయపడవలెనని కోరుచున్నాను.

మనసు అనగానేమి ? (నిశ్శబ్దము - కొన్ని నిమిషములు గడచిన వెనుక ఒక మూలలోనుండి ఈ ఉత్తరము వచ్చెను. "కోరిక" "ఆలోచనలమూట" ప్రకృతికి పురుషునకు కలియవేయు గడియ - ఒక దిగ్భ్రమపూరిత నిశ్శబ్దము ) అవును. మీలో కొందరు దానికి చాల సమీపమునకు రాగలిగితిరి. కాని మీలో ఎవరును దానియొక్క వర్ణన పూర్తిగా తెలుపలేకున్నారు. ఆలోచనలు మనసు కాజాలదు. ఎందుకన మన ఆలోచనల గుణము, స్వభావము, ప్రత్యేకత ఒక్క తీరున యుండుటలేదు. కాని మన మనసు ఒకటిగనే యుంటున్నది. ఆలోచనలే మనసుగా యుండిన, మనసుకూడ మన ఆలోచనలతో మారుచుండవలెను.

అది కోరిక కాదు. ఎందుకన, కోరిక ఆలోచనలు లేనిది నిలువజాలదు. మరియొక నిర్ణయము చాల గంద్రగోళమైనది. ఎందుకన, పురుషుడనినయేమి, ప్రకృతియనినయేమి విశదముగా తెలిసినగాని వాటి సంబంధమునుగూర్చి తెలుసుకొనుట కష్టము.

మన శాస్త్రములు చాల సూటిగా తెలుపగలుగుచున్నవి. వాటిలోనుండు స్పటికమువంటి నిర్మల

స్పష్టభావములకు, పరిపూర్ణభావ ప్రకాశమునకు, వ్యాఖ్యాన సంపూర్ణతకు ప్రపంచమున యేఇతరశాస్త్ర పరిభాషయు సరిసమానము రాజాలదు. ఋషుల హస్తములచే నిర్మింపబడిన హిందూ శాస్త్రములు అంతటి సర్వోత్కృష్ట పరిపూర్ణత్వము కలిగియున్నవి.

మన శాస్త్రములయందు ఆలోచనయని మనసు యొక్క బహిర్వ్యాపకమని తెలుపబడినది. కాని మనసు అనునది భ్రమకలిగించు శూన్యము. కాని మిక్కిలి ప్రాముఖ్యత కనుబరచుచుండును. ఆలోచనలు ప్రవహించునపుడు ఒక భ్రమింపజేయు విషయాకారమును తాల్చుచున్నది. ఒక నదియొక్క ఉదాహరణము తెలిపిన ఇది బాగుగ విశదముకాగలదు. ఒట్టి నీరు నది కాజాలదు. మఱియు రెండు గట్టులతోనున్న నీరుకూడ నదికాదు. నీరు ప్రవహించుచోట నది యుండును. ప్రవహించుటే నది యొక్క స్వభావము. అటులనే ఆలోచనలు మనసు కాదు. కాని, ఒకటి వెనుక యొకటిగా ఆలోచనలు నిరంతరము ప్రవహించుటవల్ల మనసు అను భ్రమించు విషయ స్వరూపము ఒకటి ఏర్పడుచున్నది. ఇట్టి మనసు మనములను చెదిరించుచున్నది. నీచకోరికలు, మృగచేష్టలు, దుర్మార్గ కోరికలు కలిగించి మనలను ఈ మనసు రాజ్యాంగ పరిపాలన గావించుచున్నది. ఒక్కొక్క సమయమున ఉన్నత ఆశయములు కలిగించి దివ్య కోరికలను పొందింపజేయుచున్నది.

ఇట్టి మనసును శిక్షణ గావించి, వృద్ధిపరచి మన స్వాధీనములో నుంచుకొనుటే మన వ్యక్తిత్వము అభివృద్ధి గాంచుటగా యున్నది. మనసు గెలచిన మానవుడు ప్రపంచమునకు యజమానుడుగా నుండును. మనసును స్వాధీనముచేసుకొనక ప్రపంచ సంఘటనలను లోబరచుకొన తలచుట కలవంటి వట్టి వృథా ప్రయాసగా నుండును.

ప్రపంచమున నేడు ఒక వ్యక్తిగాని, ఒక తెగగాని, ఒక జాతీయ సమూహముగాని అపజయము గాంచుటకు ఇదియే సూక్ష్మకారణము. సూక్ష్మముగా తెలుపవలెనన్న మనసుయొక్క నీచపతనమే మానవునియొక్క నీచపతనముగా యున్నది. ఇటీవల పసిఫిక్ మహా సముద్రమున ప్రేలిన ఆటంబాంబు యొక్క ఘోరశబ్దము మానవుని ఆంతర హృదయమున ప్రేలిన మహా కంపముయొక్క సూక్ష్మ ప్రతిధ్వనియని తెలియవలెను.

ప్రపంచమున అన్ని మతములకు సాధకులకు యొక్క పరిపూర్ణ శాస్త్ర విహిత శిక్షణా క్రమమును నిర్ణయించియున్నవి. దానివలన స్వయంకృత నీచవిలువల ఆలోచనలచేత అనేక ఖండములుగ పగిలియుండు మానవుని మనసు రోగనివారణపొంది ఆరోగ్యము సంపాదించుకొని తేజోవంతము కాగలదు.

మనసును వశముచేసుకొనుట అనగా ఆలోచనల ప్రవాహమును వశపరుచుకొనుట. మనలో ఆలోచనలు అత్యల్ప సంచలనముకలిగియుండిన అట్టి సమయములలో మనము పరిపూర్ణ సుఖానుభవము పొందుచుందుము. ఆలోచనలు విజృంభించి ప్రవహించుచుండిన మనసు పూర్తి అశాంతి కలిగియుండును. అట్టి మానవుడు స్వాభావికముగా దుఃఖ అందోళనరాశిలో మునిగియుండును. మనసును ఆలోచనల మందలింపువల్ల శాంతి పరుపవలెను. ఇది మనకు సులభమైన కార్యముకాదు. ఎందుకన దీనికి హృదయ గ్రంథుల బలము పూర్తిగా ఆవరించియుండును.

ఇపుడు నేను మీ ముఖ చిహ్నముల జాడనుంచి, మీకుగల గొప్ప సందేహమును కనుగొనగలుగుచున్నాను. "ఓ స్వామి! మేము సహస్ర సంఖ్యల శరీరములను భేదించి, కోటి సంఖ్యల హృదయములను పరిశీలించి యున్నాము. మీ శాస్త్రములలో తెల్పుగ్రంథులు ఏహృదయములోను చూడలేకున్నాము. మఱి హృదయమున ఒక్కనాడి చిగులుకొనినను, ఆ హృదయము వ్యవహరింపజాలక ఆగిపోగలదను శాస్త్రవాక్యములుగదా!" అని మీ సందేహము. నా మిత్రులారా! ఈ పరిభాషయందలి పదలములతో కలహమెందుకు? ఋషులు హృదయ గ్రంథులు అని వాడినపుడు ప్రకృతి నిర్ణిత

మునకు విరుద్ధముగా వారు వక్కాణించ తలచలేదు. వారి అభిప్రాయమేమన, మానవుని అశాంతి దుఃఖ రాశిలో ముంచుటకు మూడు కారణములు త్రిశూలము వలె బాధించుచున్నవి. ఈ మూడు గ్రంధులును 1. అజ్ఞానము, 2. కోరిక, 3. కర్మలుగా నెలకొని యున్నవి. (కార్యములు)

మానవుడు తన పరిపూర్ణ సర్వ శక్తిత్వమును, సర్వ వ్యాపకత్వమును పూర్తిగ ఎరిగియుండినయెడల ఎంతటి భాగ్యవంతుడుగ నుండునోగదా! అతడు తన దివ్య స్వరూపమును తెలుసుకొనలేకున్నాడు. ఇట్లు తెలియజాలని "అజ్ఞానము" వల్ల తాను అపరిపూర్ణుడయి అనుభవించుచున్నాడు. ఈ అనుభవమును తొలగించుకొనుటకు దాడిచేయుచున్నాడు. ఈ దాడి చేయుటచే మనోకోశమున కోరికలుగా ఏర్పడుచున్నవి. కోరికలు, మనసునందలి అగ్ని పర్వతములను రేపెట్టుచున్నవి. వాటినుండి ఆలోచనా ప్రవాహములను బస్మముచేయగల తార బైటికి పొల్లుచుండును. కోరిక లేనిది ఎట్టి ఆలోచనయును ఉత్పన్నముకాదు. మీలో ఈ సమయమున జాతీయపతాకమును గురించిగాని, చత్తబండిని గురించిగాని ఎవరును ఆలోచించుటలేదని నమ్ముచున్నాను. బహుశ, ఈ వేసవి ఉష్ణమునకు ఒక పంకాయుండిన బాగుండునని తలచవచ్చును. కోరిక లేనిది ఆలోచనలు బైటికిరాజాలవు. ఆలోచనల పరంపరయున్నదనిన, ఒక కోరిక యున్నదనుట నిశ్చయము. మరి ఒక కోరిక మనసులో పూర్తిగ నాటుకొనినయెడల అందువల్ల కలిగిన ఆలోచనల ప్రవాహమువల్ల ఆ కోరికయే బాహ్య ప్రపంచమున కార్యముగా ప్రకటమగుచున్నది.

ఇట్లు దివ్యస్వరూప ఆవరణమున అవిద్యనే మనో ఆవరణమున కోరికగా ఉత్పన్నమయి స్థూల ఇంద్రియ గోచర విషయ ప్రపంచమున, కార్యరూపమున బాహుళ్యముగా ప్రకటమగుచున్నది. సూక్ష్మముగా తెలుపవలెననగా, ఒక వ్యక్తియొక్క కార్యములకు గల స్థూలత్వము లేక దివ్యత్వమువల్ల అతని కోరికల గుణములు, స్వభావములు వెల్లడిఅగుచున్నవి. ఈ కోరికలు అతనియందుగల అజ్ఞానముయొక్క వ్యాపకము, ఘనీభవమును ప్రకటించుచుండును.

మతముయొక్క ప్రయత్నమంతయు భక్తుని దివ్య శిక్షణాభ్యాసములవల్ల, అజ్ఞానమును తొలగించి, ఆత్మప్రకాశము పొందునట్లు చేయుటగా యున్నది. మానవుని అజ్ఞానము మనోఆవరమున కోరికలుగా అగుపడి బాహ్య ప్రపంచమున కార్యరూపమున తెలియబడుచున్నది. ఇందుకొరకు దయాకరుణా స్వరూపులైన ఋషులు అందరు సాధకులును, తమ కార్యములయొక్క స్వభావములను నియమించి, వశపరుచుకొని మలరాహిత్యము గావించవలెనని బోధించుచున్నారు. "మంచితనమును అలవాటుచేయుడు. దయచూపుడు, ఓర్పుగలిగియుండుడు, కనికరము చూపుడు, స్వార్థతను విడిచిపెట్టుడు" అని అనేక విధముల ఉపదేశములుచేయుట, ప్రపంచమునందలి అన్ని మతములలోను కనుగొనుచున్నాము. ఇట్లు కార్యములన్నియు నియమింపబడి నిర్మలత్వము గాంచగా, కర్తయొక్క ఆలోచనల ప్రకటనయే కార్యములై యుండుటవల్ల ఆలోచనలుకూడ నిర్మలత్వమును గాంచును. ఆలోచనలు కోరికలనుండి యుత్పన్నమగుచున్నవి. కనుక నిర్మల ఆలోచనలు కోరికలను నిర్మలత్వముచేయగలుగుచున్నవి. కోరికలే మన దివ్య స్వరూప అజ్ఞాన ప్రదర్శనము - అనగా మన స్వరూపము తెలియని దోషము-దీనినే ఋషుల పరిభాషలో "అవిద్య" అని తెలుపబడును. మన దివ్య సాధనలన్నియు ఈ సూక్ష్మ శరీరమును మలినము దొలగించి, బలిష్టము గావించి దాని కార్యములంతయు నాశనము పొందగల - సూక్ష్మ దేహ (ఆత్మ) హత్య-శాస్త్రీయ సాధనముగా యున్నది. ఈ అవిద్య నాశనముతో శాశ్వత జ్ఞానము ప్రకాశించును. ఇదివరకు ప్రకాశముగాంచని ఆ ఆత్మస్వరూప ప్రకాశమే జీవరాసుల జన్మసమాప్తము పొందగల పరిపూర్ణదశ.

మీ రెల్లరు ఆలోచనల ప్రపంచమున (అనగా మానసిక వ్యవహారములలో) బహు శ్రమకులోనై క్రమశిక్షణ నియమించుటకన్న, కార్యరూపములలో

క్రమశిక్షణ నియమించుట (కొంత కష్టకార్యమైనను) సాధ్యమని అనుభవమూలమున తెలుసుకొనియున్నారు. ఉదాహరణమునకు, బ్రహ్మచర్య వ్రతము పూనుట, కొంత కష్టకార్యమైనను, మానసశక్తియు, దృఢతీర్మానముగల వ్యక్తికి అసాధ్యముకాదు. కాని మానసికముగా పరిపూర్ణ నిర్మల బ్రహ్మచర్య వ్రతము నవలంభించుట అసాధ్యకార్యమని మీరు ఒప్పుకొనగలరు. మనము, మన విద్యాసంపదవల్ల, మంచి పోషణవల్ల, జ్ఞానసంపత్తివల్ల, సాంఘిక నిర్బంధమువల్ల లేని గౌరవమును పొందగోరి, మృగచేష్టలుచేయ సమ్మతించక పోవచ్చును. స్త్రీలను చెరచుట, దోపిడిచేయుట, కొల్లగొట్టుట మొదలగునవి చేయకపోవచ్చును. కాని మనలో మానసికముగా ఇట్టి సంకల్పములు లేనివారు యేఅల్పసంఖ్య అయినను యుండగలరా ?

(సశేషము)

ఈతలో రకార్డు బ్రేక్ చేసిన అమెరికన్ యువతి

అమెరికాలోని ఈరీ సరస్సును ఈ తీరంనుంచి ఆ తీరంవరకు 15 మైళ్లు ఈదిన మొట్టమొదటి యువతి గ్రేటా పేటర్సన్. ఈమె వయస్సు 18 సంవత్సరములు. ఈ పదిహేను మైళ్ల దూరాన్ని 13 గంటలలో ఈదినది. రికార్డు మించిన ఈ ఈత ఆమె చివరి ఏడు మైళ్లలో పెద్ద గాలిదుమారాన్ని, పెద్ద కెరటాలను కూడా లెక్క చెయ్యలేదు. ఈ సంవత్సరంలోనే ఆమె ఇంతకంటె పెద్ద సరస్సు అంటేరియాలో ఈదాలని యోచిస్తున్నది. అంటేరియో సరస్సు పొడవు 32 మైళ్లు.

పరమాణుశక్తి ప్రయోజనాలపై జినీవా సమావేశం – గ్రంథం రచించడానికి ఫెర్మీసతి సంకల్పం

వాషింగ్టన్, జూలై 6 –

పరమాణుయుగకర్తగా ప్రపంచ ప్రఖ్యాతిచెంది, నోబెల్ బహుమానంపొందిన కీర్తిశేషుడు ఎన్రికో ఫెర్మీభార్య, జినీవా సమావేశానికి హాజరుకాగల అమెరికన్ ప్రతినిధి వర్గంలో చేర్చబడింది. ఈ సమావేశం మిత్రరాజ్యసమితి అధ్వర్యాన జినీవాలో పరమాణు శక్తి శాంతియుత ప్రయోజనాల గురించి జరుగుతుంది.

జినీవా సమావేశం కార్యకలాపాలను గురించి అమెరికన్ ప్రతినిధివర్గం తరఫున ఈమె నివేదిక తయారు చేస్తుందని పరమాణుశక్తి సంఘం అధ్యక్షుడు లెవిస్ స్ట్రాస్ ప్రకటించారు. సమావేశం గురించి ఈమె ఒక పుస్తకాన్ని రచించదలచింది.

ఇటాలియన్ వంశస్థురాలైన మిసెస్ ఫెర్మీ ఇదివరలో "యాటమ్స్ ఇన్ ది ఫామిలీ" అనే గ్రంథాన్ని రచించింది. ఆమె భర్త పరమాణు శక్తి పరిశోధనలు జరుపుతున్న కాలంలో తమ కుటుంబ అనుభవాలను దీనిలో వర్ణించింది. భౌతిక శాస్త్రం గురించిన ఒక హైస్కూలు పాఠ్య గ్రంథాన్ని, కొన్ని చిన్న కథలను, వ్యాసాలనుకూడా రచించింది ఆమె.

యు. యస్. ఐ. యస్

# "రాగవర్ధని"

'విజయ - రాఘవ'

[భువనేశ్వరి, అన్నయ్య రజనీ కాంతుడు యింట్లో ఏదో కీచులాడి వెళ్లి ఎక్కడో మరొకచోట మకాం పెట్టాడని విన్నది. భర్తను వెళ్లి ఒకసారి తమయింటికి పిలుచుకుని రమ్మని చెప్పింది. రజనీకాంతుడు ప్రత్యేకంగా నొకగదిలో కాపురముంటూ, చేతిలో డబ్బు మెసలాయింపులేక అన్నఆహారములు మానేసి గడుపుతుంటే అతనిని ప్రేమించి ఆరాధిస్తున్న రాగవర్ధని అన్న ఆహారాలేకాదు - సంతోష ఉత్సాహాలను పూరిస్తూవచ్చింది. అది చూచి రజనీకాంతుడు ఆనంద పరవశుడై కృతజ్ఞతను వెల్లడించాడు — యికచదువండి]

(గతసంచిక తరువాయి)

"యీ మాత్రానికేనా ! పరవాలేదు... లెండి ! ముందు భోంచెయ్యండి. తరువాత తీరుబడిగా కూర్చొని మాట్లాడుకోవచ్చు" అంది.

రజనీకాంతుడు ఒక్కొక్కముద్దే తింటూంటే, రాగవర్ధని యెప్పుడు యేంకావాలని అడుగుతారో అని ఆత్రుతనయనాలతో అవలోకిస్తోంది.

ఉల్లిపాయముక్కలతో మేళవించబడిన బంగాళా దుంపలకూరముద్ద పూర్తవగానే రెండు గాజుగ్లాసుల మంచినీళ్లు గటగటత్రాగి—

"వర్ధనీ ! నువ్వేనా యీ రోజు వంట మీ యింట్లో" అన్నాడు.

"అవును. యేం కూరలో కారం యెక్కువయిందా ! పూరికే రొప్పుతున్నారు" అంది.

"ఆ ! కాస్త యెక్కువయినట్లే ! నువ్వు కారం యెక్కువ తింటావా !" అన్నాడు.

'అవునన్నట్లు' తలూపింది రాగవర్ధని.

"ఆడవాళ్లు కారం యెక్కువ తినకూడదు సుమా !" అన్నాడు.

"యికనుంచి తగ్గించుతా ! సరేనా !" అంది.

రజనీకాంతుడు నెమ్మదిగా భోంచేసి, సిగరెట్ ముట్టించి మంచంమీద నడుంవాల్చేటప్పటికి, రాగవర్ధని విస్తరి అవతల పారేసొచ్చి, క్యారియర్ కడిగి, అలమరలోవుంచి చెయితుడుచుకొంటూ రజనీ కాంతుడి ప్రక్కకొచ్చి కూర్చొంది.

"వర్ధనీ ! నామీద నీకెందుకింత అనురాగం" అన్నాడు రజనీకాంతుడు వున్నట్టుండి.

"అదేమిటండీ ! అలా అంటారు. మనిషి జన్మెత్తిన తరువాత యిష్టంలేకుండా యెలా వుంటారు" అంది రాగవర్ధని.



2

"ఇష్టంవుంటే వుండొచ్చు. అయినా, నామీదే నీకెందుకుండాలి?"

"ఆ సంగతి భగవంతుడికే తెలియాలి. నాకేం తెలియదు. యిటువంటి ప్రశ్నలకి జవాబు లివ్వడం కూడా చేతగాదు."

"పోన్లేగాని, యింకా యేమిటి కబుర్లు?"

"ఏముంటయి."

"మీ పెద్దమ్మ బాగుందా!"

"ఆ ... బాగానేవుంది... అన్నట్టు గుర్తొచ్చింది. మొన్న యేంజరిగిందో తెలుసా!" అంది రాగవర్ధని.

"ఏంజరిగింది" - అన్నాడు రజనీకాంతుడు.

"మంచినీళ్ళకోసం మొన్న సాయంత్రం బిందె చంకనపెట్టుకొని నూతికివస్తున్నా. గుడివద్ద కొంత మంది ముసలి వెధవలు కూర్చొని, నావంకచూస్తూ "ఈ అమ్మాయినేరా ... రజనీకాంతుడు ..." అన్నారు. ఆ మాటవినగానే నాకు మహాకోపం వచ్చింది. కాని అదంతా తిన్నది మింగినట్లుమింగి; తలవంచుకొని వచ్చేసాను. ఏంచేయను" అంటూ జాలిగా చెప్పుకొచ్చింది రాగవర్ధని.

"మంచిపనిచేసావ్ వర్ధనీ! లోకులు కాకుల్లాగా కూయకపోతే కోకిల్లాగా కూస్తారా! అయినా, తీతువు పక్షులు అమంగళంకూయక మంగళం కూస్తాయా! ఎవరేమన్నాసరే తలవంచుకొని వెళ్ళి పోవలసిన రోజులివి. యేమంటానికి వీల్లేదు. నిన్నే కాదనేది నన్నూ అంతే; నేను చేసేదికూడా యింతే" అన్నాడు రజనీకాంతుడు.

టేబిల్‌గడియారం ఒంటిగంటన్నర చూపుతూం డగా, ఆఖరిమాటలు రజనీకాంతుడు అంటూండం జరుగుతూండగా రాగవర్ధనికి నిద్రొచ్చి అతని గుండె మీద వాలిపోయింది. పౌర్ణమి వెన్నెల కిరణాల్లో కొన్ని మాత్రం కిటికీగుండా వాళ్లిద్దర్ని స్పృశిస్తూ వుండిపోయినయి.

3

రజనీకాంతుడు ఆఫీసుకి వెళ్లాలి అంటే సొంత యింటిముందునుంచే వెళ్ళాలి. అతను తలవంచుకొని వెళ్ళిపోతుంటే, అతని చెల్లాయిలు, తమ్ముళ్లు వాళ్లమ్మ-నాన్న చూస్తూండేవారు. మనస్పర్థల నాధారంచేసు కొని వెళ్ళిపోయి వేరుగావుండి భోజనంచేస్తున్నా, రజనీకాంతుని హృదయంలో తల్లిదండ్రులపట్ల ప్రేమ, ఆదరాభిమానాలు నశిస్తాయా! తమ్ముళ్లు - చెల్లాయిలు అంటే యిష్టంలేకపోలేదు. నవమాసాలుమోసి, కనిపెంచిన తల్లిహృదయం తనపట్ల యెంతగా కుమిలి పోతుందో - బాధపడుతూంటుందో అతనికి తెలి యకపోలేదు. "కన్నకొడుకుకి పట్టెడన్నమైనపెట్టగా నోచలేదే" అని యెంతమందితో తన హృదయాందో ళనన్ను వ్యక్తంచేస్తోందో రజనీకాంతుడు వినలేక పోలేదు. కాని అతని హృదయాన్ని విరిచే మాటలు - చేష్టలు యెప్పుడైతే విపరీత పరిణామంలోకి వచ్చేసి, వారినోటి వెంట వినవలసివచ్చిందో, ఆ నాటినుండీ అతని హృదయం వేరుగా బ్రతకడానికి తహతహ లాడింది.

తల్లిదండ్రులు కొడుకుని యేమైనా మందలించ డానికి హక్కు లేదా! అనిపిస్తుంది యీ సందర్భంలో. ఉంది. చేతికెదిగి, వ్యక్తిత్వం తెలుసుకొని, రెక్క లొచ్చి, ఆదరాభిమానాలు అలవర్చుకొని నలుగురిలో తలెత్తుకొని తిరిగే కొడుకుని మందలించేటప్పుడు, హృదయాన్ని విరిచేటట్లుగాదు మాట్లాడేది. ఉప యోగపడేటట్లు మాట్లాడాలి. కన్నకొడుకుని మంద లించడం అంటే, మోచేతిక్రింద నీళ్లుత్రాగేవాన్ని చీవాట్లు పెట్టినట్లుగాదు. యీ నాడు తల్లిదండ్రు లతో పొత్తుకుదుర్చుకోలేక పోతున్నారంటే కొడు కులు, కారణం యిటువంటిదే! సవ్యంగా మంద లించడంచేతగాక. పర్యవసానం చూడబోతే కొడుకు కొరగానివాడవుతాడు తల్లిదండ్రులకు; తల్లిదండ్రులు కొరగానివారవుతారు కొడుక్కి. యిందులో వింత లేదు. కాని విచిత్రంమాత్రంవుంది.

ఆ నాడు ఉగాది. రజనీకాంతుడు - నేను ప్రొద్దున్నే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీకి

పోతూండగా, యింటిదగ్గరనుంచి రజనీకాంతుడు తమ్ముడొచ్చి "అన్నాయ్! అమ్మ తలంటిపోసుకోడానికి రమ్మంది రా" - అన్నాడు. వెనక్కి తిరగకుండానే రజనీకాంతుడు ... "రానన్నానని చెప్పు" అని తలవంచుకొని సమాధానం చెప్పి ముందుకి రెండడుగులు జోరుగా వేసాడు. ప్రక్కన వున్న వాడికి నాకే గుండె గతుక్కుమంది.

"అదేమిటిరా!" - అన్నాను.

"అది అంతేలే ... ముందునడు తొందరగా" అన్నాడు విసుగ్గా.

ఇక నేనావిషయం యెత్తలేదు. కాఫీలు పూర్తి చేసుకొనివచ్చి, పండుగ కాబట్టి నేనూ రజనీకాంతుని గదిలో ఆనాడు పన్నెండున్నరవరకు కాలక్షేపంచేసి, భోజనాలయిన తర్వాత పడుకొన్నాం.

సాయంత్రం మూడున్నరకు మళ్ళా లేవక తప్పదుగా - యథాలాపంగాలేచి కాళ్లు చేతులు కడుక్కుంటుండగా వాడి చెల్లెలు శారద, వెండిగిన్నెలో యేవో పండుగ పిండివంటలు పట్టుకొచ్చి గుమ్మంలో నిల్చొంది. రజనీకాంతుడు చూశాడు. యేంమాట్లాడలేదు. నేనే వూరుకోక "మీ చెల్లాయి వచ్చిందిరా!" అన్నాను.

"ఎందుకూ!" అన్నాడు శారదవంక చూస్తూ.

"అమ్మ పులిహోర పంపింది తినమని... యిదిగో!" అంటూ చేతికివ్వబోతుండగా—

"అక్కరలేదన్నానని చెప్పు" అన్నాడు కటువుగా.

అన్న రెండునిముషాలసేపు శారద వాకిట్లో నిలబడివుండి తరువాత నెమ్మదిగా వెళ్ళిపోయింది.

నాకు, రజనీకాంతుడంటే వుండే మంచిభావం కాస్తా యెందుకో ఆ సమయంలో అసహ్యంగా మారింది. "వీడికి హృదయంలేదనిపించింది. వీడికి లేదనుకొంటే బాధలేదు, అది అలావుంచు, ముందు వాళ్ళకైనా వుంటుందని తెలుసుకోలేకపోతున్నాడే" అని బాధపడ్డాను. వాడి మనస్తత్వం అర్థమయిన నాకే యిలాంటి భావాలు లేగినప్పుడు, పరాయివాడు, కొద్ది పరిచయం గల్గినవాడైతే యింకా యేవిధంగా భావించుకొంటాడు. నేనే వుండబట్టలేక—

"ఎంత కఠినంగా మాట్లాడావ్‌రా రజనీ!" అన్నాను.

"వాళ్ళకన్నా ముందు నువ్వెక్కువ బాధపడుతున్నట్లున్నావేరా" - అన్నాడు.

"అవునురా! కన్నతల్లి హృదయం నీవంటి కఠినాత్ములకు యేంతెలుస్తుంది. మనస్పర్థలు - మాట పట్టింపులుంటే వుండొచ్చు. అవన్నీ దిగమ్రింగుకొని మీ అమ్మ నీకు పంపినప్పుడు, యెందువల్ల పంపిందో, ఆలోచించకుండా, రాయిలాగా మొండిగా జవాబిస్తే, ఆ మాటకు ఆమె యెంతగా బాధపడుతుందో తెలుసా! కనీసం ఆ మాత్రంఅన్నా తెలియదా" అన్నాను వుద్రేకంతో.

"ఎందుకురా నువ్వింత కష్టపడతావ్. అవన్నీ నాకు తెలుసు. బాధ అంటే యేమిటో హృదయానికి బాగా తెలియాలి. అది వ్యక్తుల్ని పరీక్షిస్తుంది. నా తల్లి అంటే నాకు ప్రేమలేదని అనుకోకు. కాని అది ఆచరణలో చూపను. చూపితే నేను యిలా వుండనే వుండను ... తెలుసుకో ... అన్న మాటలు యెన్నిసార్లన్నా నా పట్ల యిచ్చే జవాబు యిదొక్కటే ... సరేనా!" అంటూ రజనీకాంతుడు సిగరెట్ ముట్టించి పడక కుర్చీలో జారగిల పడ్డాడు.

ఇక వాడికి నేనేం సమాధానం చెప్పాలో అర్థం కాక యేదో పుస్తకంమీదకు దృష్టిమార్చాను. కాసేపయిన తర్వాత నెమ్మదిగా యెక్కడికో వెడదామని బయలుదేరాను.

రజనీకాంతుడు నేను వెళ్లిన అరగంటకు బజారుకు వెళ్లిపోయాడు. ఆనాడు ఆతని కోసం వేచివుండే

మిత్రులెవ్వరూ కనిపించక పోయేసరికి, సరాసరి పార్కు_లోకి వెళ్లిపోయాడు. ఒంటరిగా కూర్చొని వార్తలు వింటూండే సమయంలో, ఆనంద్ మోహన్ క్రాంతినాథ్‌లు జంటగా కనిపించారు.

రజనీకాంతుడు యేమీ పల్కరించడానికి పూనుకో లేదు! యిదివరలో యెప్పుడైనా యెక్కడైనా కనబడితే 'ఏంబావా' అని పల్కరించేవాడు. యీనాడు అటు వంటిదేమీ జరగలేదు. మౌనంగా కూర్చొని, వార్తలు వింటున్నాడు. సరిగ్గా వార్తలయిన వుత్తరక్షణం లోనే, ఆనంద మోహన్ దగ్గరగ — వచ్చి

“ఏరా! రజనీ! బొత్తిగా నల్లపూసవయ్యావ్. కనిపించడంలేదేం” అన్నాడు.

“ఆ...! యేమీలేదు” అని ముక్తసరిగా జవాబిచ్చాడు. యీ సమాధానంలో అంతరార్థం ఆనంద్ మోహన్‌కి యిదివరలోనే తెలుసు. కాబట్టి క్రొత్తగా గుచ్చిగుచ్చి అడగవలసిన పని అనవసరం అనిపించి —

“అదేమిటిరా! మరీ చిక్కిపోతున్నావ్ —” అన్నాడు యీ సారి.

“చిక్కిపోతున్నానా!” తనకుతాను ప్రశ్నించుకొని ఆశ్చర్యపడ్డాడు రజనీకాంతుడు.

“చిక్కేదేముంది బావా! ఒకప్పుడు బలిసివున్నా కాబట్టి యిప్పుడు చిక్కిపోతానా! యెప్పుడూ యింతే!” అన్నాడు రజనీకాంతుడు సిగరెట్టు ముట్టించుకొంటూ.

“సరే యీ మాటలకేమొచ్చెగాని, ఒకసారి మాచెల్లాయి నిన్ను రమ్మందోయ్. - యీ మధ్య బొత్తిగా రావడమే మానేశావే!” అన్నాడు ఆనంద్ మోహన్.

“దేనికీ!”_రజనీకాంతుడు తలెత్తి ప్రశ్నించాడు.

“దేనికో నాకు మాత్రం యేంతెలుసు! ఒక వేళ అడిగినా చెప్పే తత్వంగల మనుషులా మీరంతా!” అన్నాడు వెటకారంగా ఆనంద్ మోహన్.

“అంటే చెప్పించుకోవడం తెలియదన్న మాట. అంతేనా బావా!”

“అవునవును నీవన్నది అక్షరాలా నిజమే. యిక నుంచి నేర్చుకోవాలి.”

“యీ వేళాకోళానికేమొచ్చెగాని బావా! ఎల్లుండి ఆదివారమేగా ఆ రోజువస్తానని చెప్పు. యివాళా రేపు నాకు తీరికలేదు. యేదో పనులున్నాయి” అంటూ సిమెంటు అరుగుమీదనుంచి లేచి, ఆనందమోహన్, క్రాంతినాథ్‌ల వెంటగేటు దాకావచ్చి యెవరిదారి వారు మెల్లగా చూసుకొన్నారు.

'ఎప్పుడాదివారం వస్తుందా' అని భువనేశ్వరి తారీఖులు లెక్క పెట్టసాగింది. రెండే రెండురోజులు దాటాలి. అన్నయ్య మరీ చిక్కిపోయి వుంటాడని తానూహించుకొంటూనేవుంది. అసలే సన్నగా - గడకర్రలాగా వుండేవాడు. యిప్పుడు యీ హోటలుకూడుతో మరీ సన్నబడి వుంటాడనుకొంటూనేవుంది. యీ అనుకోవడంలో నగ్నసత్యం ఆదివారంనాడు సరిగ్గా తొమ్మిదిన్నర గంటలకి, ఉదయంపూట బుజువయిపోయింది. రజనీకాంతుణ్ని చూడగానే రెండు నిమిషాలు పిచ్చిదానిలాగా ఆపాదమస్తకం పరికించి చూసింది. సన్నని సిల్కు లాల్చీ, లాంగ్ క్లాత్ పైజామా, పల్లెటూరి నమూనా సాదాచెప్పులు, కళ్లకు జోడు యివన్నీ మామూలే. అయినా భువనేశ్వరికి ఆశ్చర్యం కలిగింది. ఆ సమయంలో ఆనంద్ మోహన్ దొడ్లో స్నానం చేస్తున్నాడు.

“కూర్చోరా అన్నాయ్” - అంది భువనేశ్వరి. నెమ్మదిగా పడకుర్చీలో కూలబడుతూ,రజనీకాంతుడు

“ఏమిటే! భువనా! కబుర్లు” - అన్నాడు.

“ఏముంటయిరా! నువ్వేచెప్పాలి. బొత్తిగా పూచిక పుల్లయి పోతూన్నావురా! అమ్మ వాళ్లంతా కులాసాగానేవున్నారా!” అంటూ సకల ప్రశ్నలు వేయడం మొదలుపెట్టింది భువనేశ్వరి.

రజనీకాంతుడుకి యేమని చెప్పాలో తెలియక ముక్తసరిగా ఒక్క మాటలో "ఆ...! యేమీ లేదు" అన్నాడు.

"అదికాదురా! పెళ్లి కాకముందే యిలా వుంటే యిక పిల్లనెవరిస్తారు?"

"తెలియకడుగుతాను యెవరింటికి వెళ్లినా యిదే ప్రశ్న వేస్తారు? ఎందుకంటావ్ భువనా?"

"ఎందుకేమిటి? నా తలకాయ — పెళ్లీడొచ్చిన వాళ్లు కనబడితే అలా అడగడం ఒక సాంప్రదాయం. ఒక్క మగవాళ్లనేగాదు ఆడవాళ్లనుకూడా అంతే—"

"ఇదో వెధవలవాటు—నన్నడిగితే పోనీ. అడిగి వూరుకోరు. అనవసరంగా ముప్పయిమూడు చెత్త ప్రశ్నలు వెంట, వెంట అడుగుతారు. చెప్పకపోతే

"వీడికెంతగర్వంరా! అని మొగాళ్లు, వీడికెంతనిక్కో అని ఆడవాళ్లు,మాతులు, ముక్కులు విరుచుకొంటారు. చెప్పినందువల్ల యేమిటీ లాభం వీళ్లకు?"

"ఎమిటోయ్? అన్నాచెల్లెలు కలిసి లాభనష్టాలు తేలుస్తున్నారు." అంటూ ఆనంద్ మోహన్ లుంగి కట్టుకొంటూ వసారాలోకి వచ్చాడు.

"అవునవును తేలుస్తున్నాం నువ్వుకూడా యేమన్నా భాగం పంచుకొంటావా! నష్టాల్లో" అన్నాడు రజనీకాంతుడు.

"మీలాభాలూ — నష్టాలూ నాకేంవద్దుగాని, యీ సంవత్సరం అయినా, పప్పన్నం పెట్టిస్తావా! లేదా!" అన్నాడు ఆనంద్ మోహన్.

"అంటే..."

"అంటే! యేమిటో గ్రహించలేకుండా నే వున్నావా! బలేవాడివోయ్. ఆ ముక్కకూడా నానోటితోనే అనిపించాలనేగా -" అన్నాడు ఆనంద్ మోహన్.

"అవును తప్పేముంది. -" అన్నాడు రజనీకాంతుడు.

"సరే అయితే... పెళ్లి ... భోజనం యెప్పుడూ?"

"పెళ్లా! చేసుకొందాంలే యేం తొందర.." అన్నాడు.

"చేసుకుందాం! అంటున్నావ్. నన్ను కూడా కలుపుతున్నావ్ యేమిటి!" అన్నాడు ఆనంద్ మోహన్.

"లేదు... లేదు బావా! అది బహువచనంగా ధ్వనించినా, యేకవచనానికే వర్తిస్తుందిలే. కంగారు పడకు —" అన్నాడు రజనీకాంతుడు.

"యీ మాటలకేంగాని లేవండి భోజనాలకు అంటూ భువనేశ్వరి పమిట చెంగు దులుపుకొంటూ లేచింది.

"నేను సిద్ధంగానే వుంటగా" - అన్నాడు ఆనంద్ మోహన్ లేస్తూ.

రజనీ కాంతుడు అలాగే పడుకొని వుండటం గమనించి, భువనేశ్వరి దగ్గరగా వచ్చి —

"లేవరా అన్నయ్యా! భోంచేద్దువుగాని" అంది.

"వద్దులేవే! హోటల్ కి వెళ్లేవేళయింది. వెడతా" అంటూ రజనీకాంతుడు లేవబోయాడు.

"అదేమిటిరా! రాకరాక వస్తివి — అప్పుడే పోతానంటుంటివి భోజనం చెయ్యకుండానే; యీ పూట హోటల్ కి వెళ్ళకపోతే ఫరవాలేదులే. రోజూ తింటున్న హోటలేగా. బావగారి ప్రక్క కూర్చొని భోంచేద్దుగాని. నా మాటవినవూ" అంటూ ఆఖరి మాట జాలిగా, ప్రాధేయ పూర్వకంగా వినిపించేటప్పటికి, రజనీకాంతుడికి పోవాలనుకొంటున్న వుద్దేశ్యం నెమ్మదిగా మారి వుండాలనిపించింది.

"ఏమిటిరా! అన్నయ్యా! యింకా అలో చిస్తున్నావ్. స్నానం చెయ్యాలా?" అని అడిగింది భువనేశ్వరి.

"లేదే! చేసేవచ్చాను. కాళ్లు మాత్రం కడుక్కుంటా" నన్నాడు.

ఇత్తడి చెంబుతో భువనేశ్వరి కాళ్లుకడుక్కుంటానికి నీళ్లుతెచ్చి యిస్తూండగా, సువర్చల యింటిముందు రిక్షా ఆగింది. చేతిలో చెంబు రజనీకాంతుడికిచ్చి గేటుదగ్గరకు చూడడానికి వెళ్ళింది. 'ఎవరో' పెళ్లీడువచ్చిన అమ్మాయి, నలుపూ, నీలం -, ఆకు పచ్చ పూవులపరికిణీమీద, వంగపూవంటి వోణీవేసుకొని నల్లసిల్కుజాకెట్టు తొడుక్కొని, చేతిలో చిన్నసంచిలాగుంది, అది పట్టుకొని రిక్షాదిగి లోపలికి వెళ్లడం చూసింది. ఎవరో చుట్టాలనుకొని భువనేశ్వరి వెనక్కితిరిగి వంటయింట్లోకి, సరాసరి వచ్చేసింది. ఆనంద్‌మోహన్, రజనీకాంతుడు పీటల మీద కూర్చొని వున్నారు. యేవో పిచ్చాపాటీ కబుర్లు వారిద్దరిమధ్యా సాగుతున్నయి.

"మళ్ళా యెక్కడికెళ్ళావ్ యింతలో పెత్తనానికి" అన్నాడు. ఆనంద్‌మోహన్, భువనేశ్వరి హాఠాత్తు రాకచూసి.

"పెత్తనంలేదూ-గిత్తనంలేదూ. సువర్చల యింటి ముందు రిక్షాఆగితే 'యెవరా దిగిందీ' అని చూడ్డానికి వెళ్ళాను" అంటూ అన్నం వడ్డిస్తూ జవాబిచ్చింది.

"ఎవరైతే నీకెందుకు? చెప్పు. అన్నీ నీకే కావాలి. అయినా యింతకీ ఎవరూ వచ్చింది" అని అడిగాడు ఆనంద్‌మోహన్ కుతూహలంతో.

"ఎవరొచ్చారో మీకెందుకు చెప్పండి! అన్నీ మీకే కావాలి" అని వెంటనే జవాబిచ్చేటప్పటికి - పచ్చిమిరపకాయ కొరుక్కుంటున్న ఆనంద్‌మోహన్‌కి, యేమనాలో తెలియక-

"అన్నమాట అనడం బాగా నేర్చావ్. చాల్లే తెలివితేటలు. యెవరైనా చూస్తే నవ్విపోతారు" అన్నాడు.

"ఎవరో పరాయివాళ్లు నవ్వుతారనుకోవడం దేనికి? అయిన వాణ్ణి నాకే నవ్వొస్తోంది మీ మాటలు వింటుంటే" అన్నాడు నవ్వుతూ రజనీకాంతుడు. ఆ సమాధానంవిని భువనేశ్వరి - ఆనంద్‌మోహన్ ఒకోరిమొగాలొకరు చూసుకొని నవ్వుకోవడం మొదలెట్టుకొన్నారు.

ఎంత నవ్వులాటలో మునిగితేల్తున్నా, భువనేశ్వరికి హృదయంలో అణుచుకొన్న సందేహాలు మాటిమాటికి తలలెత్తుతూనే వున్నాయి. భోజనాల వద్ద అడగడం తనకేమీ మంచిగా తోచలేదు. ఒక వేళ భోజనాలయిన తర్వాత, విశ్రాంతిగా పడుకున్నప్పుడు అడుగుతామనుకో! "యివన్నీ అడగడానికేనా భువనా! నన్ను రమ్మన్నది - భోజనం పెట్టింది" అని తనలో తాను బాధపడిపోతాడేమో! అనిపించింది. పోనీ అడగకుండా వూరుకొందామా అంటే మనసు వూరుకోటంలేదు - అడిగేంతవరకు. యెలాగా! యీ సమస్య తేలేది అని పరిపరి విధాలుగా తపించిపోవడం మొదలెట్టింది. రజనీకాంతుడు - ఆనంద్‌మోహన్ యిద్దరూ భోంచేసి వక్కపొడి వేసుకొంటూ వసారాలోకి వచ్చేసి, చెరొక మడతమంచంమీద పడుకున్నారు. భువనేశ్వరి నెమ్మదిగా వెళ్ళి రేడియోట్యూనుచేసి, తానుకూడా భోజనానికి కూర్చొంది. రేడియో సంగీతంవింటూ - రజనీకాంతుడు - ఆనంద్‌మోహన్ ఆనాడు మధ్యాహ్నం కాసేపు కన్నుమూసారు.

## 4

సువర్చల అప్పుడే స్నానంచేసి మధ్యవరండాలో కూర్చొని తలదువ్వుకొంటోంది. యింటిముందు రిక్షా ఆగడం చూసింది. 'ఎవరా!' అని తలపైకెత్తి చూసింది. 'రాగవర్ధని' రిక్షావాడికి డబ్బులిచ్చి వస్తోంది. గబుక్కున తలముడివేసుకొని, యెదురు వెళ్ళి-

"ఇదేనా! రావడం వర్ధనీ" అంది.

"అవునే. యిప్పుడే వస్తున్నా! యెన్నాళ్ళబట్టో వద్దామని, యిల్లు తెలియలేదాయె. యేంచేయను?

యివాళ యెలాగైనా వెతికి, వెళ్ళాలని బయలు దేరా. అంతా కులాసా” అని అడిగింది రాగవర్ధని చిరునవ్వుతో.

“ఆ ... కులాసాగానే వున్నాం - యెన్నాళ్ళయిందే మనిద్దరం కలుసుకొని! దాదాపు రెండు సంవత్సరాలుకాలేదూ! బొత్తిగా చిక్కిపోయావేమే! చూడంగానే గుర్తుపట్టలేకపోయానుమా! ఎక్కడో చూసినట్లు గుర్తుకొస్తోంది. కాని అవునో, కాదో అని సందేహం” అంటూ సువర్చల లోపలికి తీసికెళ్ళి కూర్చోమని కుర్చీ వేసింది.

“సువర్చల చాపమీద కూర్చొని తలముడివిప్ప తీసుకొని దువ్వుకొంటూ మీ పెద్దమ్మ కులాసాగా వుందా” అని అడిగింది.

“ఆ ... ! యిప్పుడీవూళ్ళోనే వుంటున్నాంగా” అంది రాగవర్ధని.

“ఎన్నాళ్ళబట్టి ?”

“ఎన్నాళ్ళుకాకేం! దాదాపు రెండు సంవత్సరాలయింది.”

“మరి యిన్నాళ్ళబట్టి, ఒకసారైనా రాలేదేమే! మా యింటికి. మరచిపోయావా” అంది సువర్చల వాలుజడ, కొసలుకి నల్లరిబ్బను ముడివేస్తూ.

“మరచిపోలేదే ! మీరిక్కడుంటున్నారని మొన్న మధ్యవరకూ తెలీదు. రాకపోవడానికి చాలా కారణా లున్నాయి. అవన్నీ తర్వాత తీరుబడిగా చెబుతా” అంది రాగవర్ధని. వోణీ చెంగుతో మొగం తుడుచుకొంటూ ” “మీవారులేరా” అంది.

“ఉన్నారు. యివాళ ఆదివారంగదూ! సెలవాయె. ఏ లైబ్రరీలోనో వుండివుంటారు. వస్తారు నెమ్మదిగా” అంటూ దువ్వెన, అద్దం టేబిల్ మీద వుంచి, నూనె చేతులు కడుక్కొంటానికి దొడ్లోకి వెళ్ళింది. రాగవర్ధని టేబిల్ మీదవున్న ‘ఆంధ్ర పత్రిక’ అందుకొని పేజీలు తిరగవేస్తూండగా- యేవో పుస్తకాలుపట్టుకొని, లోపలికివస్తున్న క్రాంతీనాథ్ ని, దొడ్డిగుమ్మంలోంచి సువర్చలచూసి, వాకిట్లోకి చరచరావుంటూ వచ్చేసి-

(సశేషము)

# భాసుని 'ప్రతిమా' నాటకమున కైకేయి

శ్రీ నేలటూరి భక్తవత్సలము



ఈమె కేకయ దేశ 'రాజ' దంపతులకు పుత్త్రిక, భ్రాతృమతి. ఇక్ష్వాకువులతో వియ్య మంద గలందులకుఁ దగినంత గొప్పతనము ఈ వంశమువారికిని ఉండి యుండునని ధారాళముగ ఊహింపవచ్చును.

కైకేయి రూప మెట్టిదో వర్ణించు వాక్యములు ఈ ప్రతిమా నాటకమునఁ బ్రత్యక్షముగ లేకున్నను, దశరథుఁడు రాజ్య శుల్కమును వాగ్దానముచేసి ఈమెను పెండ్లాడెనను సంశము చెప్పఁబడి యుండుటచేత అది ఈమె రూపాది గుణాతిశయములకు దృఢమైన ప్రమాణమే అగును.

ప్రబంధ నాయికలకు సకల కళా ప్రావీణ్య ముండెడిదని వర్ణించుట కవుల పరిపాటి. కైకేయి యందట్టి ప్రావీణ్యమును వర్ణింపవలసిన సందర్భములు ఈ నాటకమున లేవుగాని, రామాయణ కథాంశములే ఇందుఁ గైకొనఁబడి యుండుటచే శంబరాసుర యుద్ధ సమయమున కైకేయి భర్తకుం దోడ్పడి రథ చోదన శత్రు ప్రహార ప్రతిక్రియాదిక మందుఁజూపినట్లు రామాయణమునఁ గీర్తింపఁబడిన నేర్పును ప్రతిమా నాటక మందును కవి చెప్పినట్లే తలంపవచ్చును.

ఈమెకు పతిభక్తి అపారము. మఱియొక విశేష మేమనఁగా తన పుత్త్రుఁడగు భరతునిపై నున్నంత కన్న రామునిపైనే ఈమె కెక్కువ ప్రేమ. అట్లే ఈమెపై భరతున కున్నంతకన్న రామున కెక్కువ భక్తి. ఈమె జీవిత చరితమున ఒక పరి పతిభక్తికిని రామునందలి ప్రేమకును సంఘర్షణము కల్గినది. ఒరయిక కలిగినప్పుడే కదా గుణవతుల గుణము ప్రకాశించును.

భరతుఁడు తాతగారి యింట నున్నప్పుడు దశరథుఁడు రామునకు రాజ్యాభిషేకము సేయ సంకల్పించెను. ఆ రాజ్యాభిషేకము జరుగునేని కైకేయిని పెండ్లాడునప్పుడు రాజ్యము నామె పుత్త్రున కిత్తునని వాగ్దానము చేసియుండినట్టి దశరథునకు అసత్య దోషము కల్గును. తన వాగ్దానమును మఱచిపోయి రాజు రామాభిషేకమునకు పూనుకొనెను. ఎవరైన జ్ఞప్తి పఱుపకున్నచో ఆ వాగ్దాన మిప్పుడతని తలంపునకేరాదు, కాన నతఁడు రాము నభిషేకించి యసత్య దోషమునకు గుఱి యగును. పతికి అసత్య దోషము వాటిల నుండి పతివ్రత చూచుచు మిన్నకుండ

రాదు. ఆ యసత్య దోషమును బోనాడ్పుటకై కైకేయి పూర్వ వాగ్దానమును జ్ఞప్తి పఱచినచోఁ దనకు ప్రాణాధిక ప్రియ పుత్రుఁడగు రామునకు రాజ్యాభిషేక శ్రేయో భంగమును గూర్చినట్లగును. నిజ మెఱుఁగని పలుగాకులైన లోకులు ఆమెను నిందింతురు. అట్టి తరుణమున కైకేయి రామునందలి ప్రేమ కన్నను భర్త యందలి భక్తినే ప్రధానీకరించి, భర్త కసత్య దోషముం బాప సమకట్టి పూర్వ వాగ్దానము నతనికి జ్ఞప్తిపఱుపఁ గోరియు అందులకు తనకు నోరాడక ఆ పనిని మంథరచేత చేయించినది. రామ పట్టాభిషేక మాగి పోయినది. రాజ్యాధికారము భరతునకు సంక్రమించెను. ఇందులకు హేతువు లేని పూర్వ వాగ్దానమే కాని కైకేయి కోరిన వరము కాదు.

రాముఁడు పదునాల్గు సంవత్సరము లరణ్యమున వసింపవలయుననియు కైకేయి కోరినది. ఈ కోరికకుఁగూడ పతియందామెకుగల భక్తియు, రామునం దామెకున్న యనురాగములే కారణములు. ఎట్లనఁగా పుత్ర శోకముచేత మరణింపవలసినట్లు రాజునకు ముని శాప ముండెను. అందుకుం బ్రతిక్రియ యేమియుం జేయక మిన్నకుండినచో దశరథుని మరణము తప్పదు, ఆ మరణమునకు పుత్త్ర శోకము కారణముకాక తప్పదు. పుత్త్ర శోకము పుత్త్రున కాపద వాటిల్లనిదే కలుగదు. దశరథునకుఁ బుత్త్రులు నల్వురలో శ్రీరాముఁడే ప్రియతముఁడు. కావున దశరథునకు ప్రాణహారకమగు పాటి పుత్త్ర శోకము కలుగవలయునన్న అతనికి ప్రాణాధిక ప్రియుఁడగు శ్రీరామునకు హాని గలుగవలసివచ్చును. వేఱుపాయములచే దశరథునకును రామునకును విశ్లేష మొనఁగూర్చినచో దానంగొంత పుత్త్ర శోకమనుభూతమై మునిశాప తీవ్రత తగ్గి అటు భర్తకును, ఇటు రామునకును ఆత్యంతిక హానితప్పి పోవచ్చునని కైకేయి అనుకొన్నది. ముప్వురు రాణులలోను ఈ తలం పీమె కొక్కతెకే కల్గుటకు ఈమె యొక్క ధీభక్త్యతిశయములే కారణములు.

పదునాలుగు దినముల యెడబాటు కలిగింతమని కైక అనుకొన్నదఁట. కాని దశరథుని మరణముం దప్పిపోసియనట్టి ముని శాప రూపమును దుర్విధి ఈమె వాక్కును వశపఱచుకొని ఈమెచేత పదునాలుగు నాళ్లనుటకు మాఱు పదునాలుగేండ్లనిపించినది. లోకమీమెను తిట్టి పోసినది. లోకమును జెప్పనేల ? దశరథుఁడును భరతుఁడును ఈమె సత్సంకల్పమును గుర్తింప నేఱక రామ విరహ శోకాతిశయ ప్రేరితులై ఈమె ననరాని మాటలనిరి. ఈమెయొక్క సత్సంకల్ప

మును గుర్తెఱింగి సుమంత్ర వసిష్ఠ వామదేవాదులు లోలోన సంతుష్టులైరి. నిజమెఱింగిన తర్వాత భరతుఁడు తాను కావించిన మాతృపచారమునకు పశ్చాత్తప్తుఁడై ప్రణమిల్లి క్షమ వేడుకొని మన్నన పొందెను.

దశరథుఁడు రామాభిషేకము సంకల్పించి నంతనే కైకేయికి మంథర దుర్బోధన చేసెననియు, ఆమె కంతకు మున్నెన్నఁడును లేని సపత్నీ ద్వేషము అప్పటికప్పుడుప్పొంగెననియు సపత్నీ పుత్త్రుని రాము నడవుల పాలుచేసెననియు, కేవలము రాజ్యలోభముచేత వైధవ్యమునుగూడ తృణీకరించి భరతాభిషేకమును కోరినదనియు రామాయణకవి చెప్పినాఁడు - కథాంశములలో వలసిన మార్పులుచేసి కైకేయి నడవడికి తగిన యుపపత్తులను కల్పించి భాస మహాకవి ఆమె శీలమును మహోజ్జ్వలముగం దీర్చి దిద్దినాఁడు. భాసుఁడు వర్ణించిన రీతిలో కైకేయి లోక నిందలకుఁ దలయొగ్గి పతియొక్క మేలునకును, పుత్త్రుని శ్రేయమునకు పాటుపడినది. ధర్మము వలనఁ గీర్తికలుగునేని కీర్తికై ధర్మమును సామాన్యులెల్లరు నవలంబింతురు. ధర్మమునకును కీర్తికిని సంఘర్షణ కలిగినచోట, వానిలో నొక్కదానిని గ్రహించి తక్కిన దానిని త్యజింపవలసి నప్పుడు, గ్రాహ్యమేది? త్యాజ్యమేది? కీర్తియే ప్రాప్యమనియు ధర్మ మందులకు సాధనమనియు ననుకొను సామాన్యులు ధర్మము నటుంచి కీర్తి నవలంభింతురు. ధర్మమును ప్రయోజనాంతర సాధనముగాఁ గొనక స్వతఃప్రయోజనముగ సంభావించు లోకోత్తర మహావ్యక్తులు ఏదోవొక సమయమున ధర్మమే కారణముగ తాత్కాలికముగ అకీర్తి కల్గునేనియు సంకుగొనక ధర్మమునే అవలంబించి యుందురు. అట్టి చరితమునకు ఉత్తమోత్తమ లక్ష్యముగా కైకేయి వృత్తమును భాసుఁడు నిబంధించెను.

# నగర నిశీధ శకలము

మూలం :

గోల్డ్ స్మిత్

స్వేచ్ఛానువాదం :

శ్రీ తిరుపతి అనంత పద్మనాభరావు

అప్పుడే గడియారం ఠంగ్ ఠంగ్ మని రెండు గంటలు కొట్టింది. ప్రమిదలోని దీపం వెలిగి అలసి అవసానదశకు చేరబోతుంది. కాపలాదారు నిద్రాదేవి మహిమవల్ల గంటను పలుకడం మరచాడు. కష్టసుఖ జీవులిరువురు ప్రశాంతంగా నిద్రబోతున్నారు. కాని నేరస్థులు, భోగజీవులు, ఆశలు దిగినట్టి అయ్యలు మాత్రం నిద్రాదేవికి వ్యతిరేకంగా ప్రవరిస్తున్నారు. దోపిడీదారు తన అర్ధరాత్రిపయనానికి సన్నిద్ధుడౌతున్నాడు. త్రాగుబోతు నాశనకారియయిన మధుపాత్రను మరల మరల నింపుతున్నాడు. జీవితం మీద విరక్తి చెందిన మానసి ఆత్మహత్యకు సిద్ధపడుతున్నాడు.

సమకాలికులలో కొందరు మేధావంతులు వ్రాసిన గ్రంథాలలో నొకదాన్ని ఆమూలాగ్రంచదివి పూర్తి చేసాను. శేషించిన సమయాన్ని వ్యర్థపుచ్చకుండా అలా ఒకమారు తిమిరములోకి తొంగి చూద్దామనే బుద్ధి జనించింది నాకు మనసులో......?

నా ఒంటరి నడకలో ఎన్నో భావాలు చెలరేగుతున్నాయి. నలుమూలలా కారు చీకటి క్రమ్ముకొని వుంది. సూది క్రిందపడ్డా శబ్దం వినిపించేట్లువుంది. కొన్ని గంటల క్రితం దేదీప్యమానంగా వెలిగిన నగరం పాలకోసం యేడ్చియేడ్చి ప్రశాంతంగా నిద్రబోయిన పాపమాదిరి అంధకారంలోకి ముడుచుకుపోయింది.

ఏమి యీ అంధకారబంధురావళి! అంతిమావస్థలో వున్న దీపం ఆరిపోవడానికి పచ్చని చిన్ని వెలుగుతో మిణుకు మిణుకు మంటున్నది ఓ కిటికీలోంచి. దూరాన కుక్క మొరుగుడు, గడియారం టిక్ టిక్ శబ్దంతప్ప మరేమి పినిపించడంలేదు. ప్రజల గర్వం అంతా ఆ నిశీధములో నంగనాచివలె దాగుకొనివుంది. తాత్కాలికంగా వచ్చిన యీ ప్రశాంత వాతావరణము యెప్పుడో ఒకరోజు శాశ్వత రూపందాల్చక మానదు. పూర్వనగరాలవలె యీ నగరంకూడ ఒకప్పుడు శిథిలమై, మటుమాయమై ఛాయలుకూడా కానరాకుండా పోవచ్చు.

గడచిన కాలంలో యిలాంటి నగరాలెన్నో మహా వైభవంతో తులతూగుతూ మహోజ్వలంగా వెలిగిన మహానగరాలు నేడు కనీసం రూపు రేఖలుకూడా గుర్తు తెలియకుండా కాలవాహినిలో కలసిపోయాయి. కొన్ని శిథిలాల రూపంలోనయినా చరిత్రకారుల పరిశోధనవల్ల వాటివైభవాన్ని వేనోళ్ల చూటుతూ వెలికి రాగలిగాయంటే యిది యీనాటివారి అదృష్టపు పంట.

"ఇదిగో! ఇక్కడే!!" అని ఓగట్టి కేక వేస్తాడు తను వూహాప్రపంచంలో నిర్మించుకొన్న నగరకోట యిక్కడ వుందని ఓ మానవుడు శిథిలనగరాన్ని చూచి! ఇప్పుడదంతా పచ్చికయినా పెరుగని ఎడారి! ఆవైపేయుండేది రాజుగారిదర్బారు. ఇప్పుడది శిథిలావస్థలోవుండి దుష్టజంతువుల కాలవాలమయింది. అప్పుడీస్థళంలోనే చిత్రప్రదర్శనశాలలూ, ఆలయాలు వుండేవి. ఇప్పుడాబాటనే ముండ్లపొదలు, రాళ్లగుట్టలు. నాశనమయింది! అంతా నాశనమయింది!! ఈ మహానగరం ఆనాడు నూత్న శోభతో నిత్య కళ్యాణ పచ్చతోరణంలా వెలుగుచుండేది! మహారాజు, ప్రజలు సదా సంగీత సాహిత్య శిల్ప విలాసాదులలో మునిగితేలుతూ వుండేవారు. ఆ మహానగరానికి వాటిల్లిన దురవస్థను తలచుకొని, అంతా భగవంతుని సృష్టిలీలలుగదా!

కొన్ని గంటలక్రితం యీ వీధులు జనసమూహంతో నిండియుండేవి. కాని యిప్పుడు! అంతా శూన్యం! ఇల్లు వాకిలిలేని నిర్భాగ్యులు ధనమదాంధుల మేడల నీడల్లో నిద్రబోతున్నారు. అబ్బ! ఎంత దారుణ దృశ్యం. అనాథలు, దేశద్రిమ్మరులు అయిన వారి

బాగును కోరే వారే లేరా యీ మహానగరంలో! తమ జీవిత పర్యంతం వాళ్లు బానిసలుగా వుండవలసిందేనా? వాళ్లకు అందులకు ముట్టే ప్రతిఫలం చింకి పేలికలు, గోచిపాతలేనా? ఆకలితో హతమయ్యే అస్థిపంజరాలు కారు చీకట్లో దొర్లుతున్నాయి. వారిని చూచి జాలిపడేవారికన్నా బుసలుకొట్టే వారే యెక్కువ. సంఘం వాళ్లకు చేయూతనివ్వదా? కాల వాహినిలో కలసిపోయిన రాజ్యాలలో కూడా యీ విధంగానే వుండేదా?

ఎందుకు ...? నేనెందుకు మానవుడినై జన్మించాను యీ క్షణిక ప్రపంచంలో! ఈ నిర్భాగ్య జీవుల కడగండ్లనుచూచి వాళ్లకు తగిన చేయూత నివ్వని నా బ్రతుకు దేనికి..? క్షణక్షణ అనుక్షణం దురరణం పాలుబడే యీ భయంకర పద్మవ్యూహంలో నేనెందుకు మనిషినై జన్మించాలి! ధనవంతులు గోరంతను కొండంతలు చేయగలరు. వారి యిండ్లలో కుక్క చనిపోతే చూచుటకు వచ్చే జనంలో పదోవంతయినా యీ అభాగ్య జీవి చనిపోతే తిరిగయినా చూడరు. సంఘం, న్యాయం రెండూ వీరికి వ్యతిరేకమయితే వాళ్లగతేమిటి? ఎందుకు నా హృదయం యింత ఆవేదనా పూరితంకావాలి!

ఒకరికి సహాయపడలేని నా జాలి వ్యర్థమయినా ఆదీనస్థితిలో కష్టపడే వ్యధకంటే జాలిపడే వ్యక్తి మనోవేదన యింతింత అని చెప్పడానికి వీలులేదు.

శుభ్రాత్రమ్-

---

## శ్రీ కే. వి. రాధాకృష్ణశాస్త్రిగారు

జూన్ నెల 26వ తేదీన విద్వాన్ కే. వి. రాధాకృష్ణశాస్త్రిగారు పరమపదించారని తెలుపుటకు చాల విచారపడుతున్నాము.

శ్రీ శాస్త్రిగారు తమిళులైనా తెలుగుపండితులు, పట్టభద్రులూనుకూడా. మద్రాసులో లయోలా కాలేజిలోను, క్వీన్ మేరీస్ కళాశాలలోను ఆచార్యత్వము నిర్వహించినవారు. కేసరి విద్యాలయములో ప్రారంభదశలో ప్రధానోపాధ్యాయులుగా యుండి దాని రూపురేఖలు దిద్దినట్టివారు.

నిష్కపటి, నిరాడంబరుడు, నిత్య సంతోషి. ఆయన మందహాసం ఎదటివారికి ఎప్పుడు స్వాగతము చెప్పుచుండెడిది. ఆయనకు విరోధులంటూలేరు; యితరులెవరు ఆయనను విరోధిగా నెంచియుండరు. ఆయన ఎక్కడయున్నా, ఏమిచేసినా ఎదటివారి హితాన్ని, శ్రేయస్సును కోరునట్టి విశాల హృదయుడు. ఉన్న అవకాశాలను సద్వినియోగంచేసికొని వాని కనువొద్దికగా తోడివారికి యిబ్బంది, బాధ కలుగకుండా జీవయాత్ర సాగించినవాడు శ్రీ శాస్త్రిగారు. ఆచార్యుడుగా విద్యార్థుల ఆదరాభిమానములకు పాత్రుడైనవాడు. ఆయన సుశిక్షణ విద్యార్థులకు ఎంతగానో ఉపకరించేది. ఆయన దగ్గర శిక్షణపొందినవారు కలకాలము కృతజ్ఞతను వెల్లడించి శాస్త్రిగారిని స్మరిస్తారు.

శ్రీ. శే. కేసరిగారు 'నా చిన్ననాటి ముచ్చట్లు' రచనకు పూనుకోడానికి శ్రీ శాస్త్రిగారొక కారణం. కేసరి విద్యాలయంలో పిల్లలలోపిన్నగా, పెద్దలలో పెద్దగా వ్యవహరించి సహచరులను ఉత్సాహపరుస్తూ విద్యాలయ పురోభివృద్ధికి వారు చేసినకృషి అపారము.

శ్రీరాధాకృష్ణశాస్త్రిగారి వయసు చనిపోయేటప్పటికి 62 సంవత్సరములు. ఒక్కడే కుమారుడు.

దుఃఖసముద్రంలోనున్న భార్య, కుమారుడు, బంధువులకు మా సానుభూతి సంతాపమును తెలుపుతూ, వారి పవిత్రాత్మకు సుస్థిరమైన శాంతి సమకూరుగాకయని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

'సిసి'

# ప్రబోధం

శ్రీమతి ఎమ్. లక్ష్మీదేవి

కమలను నమలి మింగేద్దామన్నంత కోపం సుందరానికి. అంత కోపానికి కారణం కమల తన కెదురాడిందని. అసలు ఈ గోల ఎందుకు వచ్చిందంటే కమల నీళ్ళపొయ్యి రాజేసి నీళ్ళు చేదుతూంది – సుందరం "కాఫీలో పంచదార చాల్లేదు. కాస్త వెయ్యి" అన్నాడు. కమల "నీళ్లు చేదుతున్నాను. ఆ డబ్బాలో ఉంది. వేసుకోండి" అని జవాబిచ్చింది పెరట్లోంచి. ఆ జవాబువిని మళ్ళ సుందరం అధికార దర్పంతో, "ఏయ్ ! ఎన్నిసార్లు చెప్పాలేమిటి ? చెవుడా ? కాస్త పంచదార వేసి పొమ్మంటె ... నా మాటంటె నీకు అలక్ష్యంకదూ!" అని గదమాయించాడు.

కమల అసలే రోషవతి. అందులో ఇన్ని మాటలు సహించి ఊరుకుంటుందా ?

"ఔనులెండి – మీ కాలికింద దాసీ దానిలాగ పడిఉన్నాను కాబట్టి అనరాని మాట లంటారు. ఈ విధంగా ఏడ్పించడానికే గాబోలు నన్ను పెళ్ళిచేసుకొన్నది. చేయరానిచాకిరి ఏధనవంతుల ఇంట్లో పుట్టిన పిల్ల మీకు చేస్తుందీ" అన్నది.

మాటకుమాట ముదిరింది. సుందరం ఏదో అల్పవిషయానికి కమల నెందుకనాలని ఊరుకున్నాడా అంటే–లేదు. చాలా పట్టుదలకల మనిషి. అందరిలాగ భార్య మాటలకు లోబడే వాణ్ణికాదని డంబాలు కొట్టుకొనేవాడు. సాధారణంగా ఊరుకోలేడు. కమల ధనవంతుల ఇంట్లో పుట్టింది. తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళన్న రకం మనిషి.

తన కోపంతీర నోటికొచ్చినట్లల్లా అన్నాడు సుందరం. కమల కన్నీళ్ళతో వంటింటికి వెళ్ళిపోయింది. తల్లిదండ్రుల వాగ్వాదాన్ని చూస్తూన్న రఘు మెల్లిగా దేకుతూ ఒకమూల కూర్చొని కళ్లు నులుపుకొంటూ బిక్కమొగంతో చూస్తున్నాడు. సుందరం బయటి చావడికొచ్చి బల్లమీదున్న పుస్తకాలను చిందరవందరగా విసరి ఫౌంటెన్ కలముతీసి ఏదో వ్రాయబోయాడు, కాని అందులో సిరా లేదు కాబట్టి అది వ్రాయలేదు. మఱింత కోపం హెచ్చింది. విసరి టేబిలుమీద పారేసి చేతిని చెంపమీద పెట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

కమల వంటింటికివెళ్ళి పొయ్యి ఊదింది. అది మండలేదు. మళ్లా ఊదింది. కాని పొయ్యి మాత్రం మండలేదు. కోపం రగులుక వచ్చింది. ఒక చెంబు

నీళ్లు తెచ్చి పొయ్యిలోపోసి 'పెల్ఫ్' నాను కొని ఏడుస్తూ నించుంది.

కమల, సుందరంలు అన్యోన్యంగా నాలుగేండ్లుగా సంసారం చేస్తున్నారు. కాని ఇంతవరకు గృహ కల్లోలం, కలహం అంటె ఏమిటో ఎరుగరు. సుందరం ఇంత వరకు కమలను ఒక్కమాటమైన అన లేదు. కమల ఎదిరించిందీలేదు. కర్మం చాలక ఇవాళ ఇద్దరూ ఒక కలహంలోకి దిగారు.

తొమ్మిదిన్నరైంది. పదిగంటలకు ఆఫీసు కెళ్ళాలి సుందరం. ఇంకా వంట కాలేదు. ఒకరితో నొకరు మాట్లాడమని మనస్సులో శపథం చేసుకొన్నారిద్దరూను.

గాలి తరంగాల్లో మధురమైన గంధర్వ గానం వినిపించింది. భార్యా భర్తలకు పరస్పరమున్న ద్వేషమును మనస్సు మర్చి పోయి ఆ గానంలో లీనమైంది. సన్నటి కోకిలలాంటి మధుర స్వరం హార్మోని యంతో మనోహరంగా అమరిపోయింది.

వీధి గుమ్మందగ్గరి కెళ్లాడు సుందరం. వెనకనే రఘు నెత్తుకొని కమల వచ్చింది. ఒక మురికి చింపి పరికిణీ కట్టుకొని, చిని గినగుడ్డ పమిట వేసుకొని ఆ రేండ్లపిల్ల పుష్పం తన సౌరభాన్ని వెదజల్లి తుమ్మెద లను ఆకర్షించేటట్లు తన మధురమైన కంఠ ధ్వనితో అందరి హృదయాలను ఆకర్షించు కొంది. ఆ పిల్లచుట్టు జనం మూగారు.

"వృథాకలహము మాని ప్రేమతో సంసారము నడుపుమా" అని మధు రంగా పాడుతూంది. సుందరం కమలను చూశాడు. కమల సుందరాన్ని చూసింది. రఘు చప్పట్లు చరుస్తూ కమల చంకలో నుంచి దిగి సుందరం కాళ్లను కావిలించు కొన్నాడు. పాట పూర్తికాగానే హార్మో నియం వాయిస్తున్నవాడు. "అయ్యా! బీదవారం - ఏదో దొరగారు దయ తల చాలి" అన్నాడు.

"ఆ అమ్మాయి నీకేం గావాలి" అన్నాడు సుందర. "కూతురండీ" అన్నాడు. "అమ్మాయి! మరొకపాట పాడు" అన్నది కమల. ఆ పిల్ల పాడింది. కమల ఆరునెలల క్రిందట కొన్న కొత్త చీర తెచ్చి ఆ అమ్మాయి కిచ్చింది. సుందరం జేబులో చెయ్యిపెట్టగానే దొరికినదాన్ని ఆ పిల్ల చేతికిచ్చాడు. వారి ధాతృత్వానికి ఆ జనసమూహము ఆశ్చర్యపడిపోయింది.

ఆ పిల్ల వెళ్లిపోయింది. కాని కమల సుందరం మనస్సులు ఆ పిల్ల కంఠధ్వనిలోనే లీనమైపోయినవి. ఆ పిల్ల వెళ్లిన వేపే చూస్తూ నిలబడిపోయారు. దూరంలో నుండి గాలి తరంగాల్లో "వృథా కలహముమాని" అన్నపాట మధురంగా వినబడుతూంది. కమల హృదయంలో ఆ ప్రబోధం స్థిరంగా నిల్చిపోయింది. తన

అవివేకానికి తన్ను తానే నిందించుకొంది. గాలి ఇప్పుడు ఆ పిల్ల పాటలను కమల చెవుల కందించడంలేదు. కాని కమల చెవుల్లో ఆ పిల్ల పాటలు ప్రతి ధ్వనిస్తూనే ఉన్నవి. సుందరం చాలా సిగ్గుపడ్డాడు. అధికారంతో కమలను అన్నందుకు నొచ్చుకొన్నాడు. ''వంటైందా కమలం'' అన్నాడు సుందరం కాళ్లు పట్టుకొన్న రఘు నెత్తుకొంటూ – కమల కోపం ఎగిరి పోయింది. ''ఇప్పుడింకా తొమ్మిదిన్న రేగా, పదిహేను నిముషాల్లో వంటచేసి పెట్టే స్తాను'' అని లోపలికి పరుగెత్తింది కమల.

సుందరం భోజనానికి కూర్చున్నాడు. నిజంగా సుందరం చాలా ఆశ్చర్యపడి పోయాడు. పదిహేను నిముషాల్లో అన్నం' పులుసు, పచ్చడిచేసిన కమల చాతుర్యానికి చాలా మెచ్చుకున్నాడు. వంట రుచిగా ఉంది. సుందరం పులుసన్నం సగం తిని ''ఇవాళ నీచాతుర్యమా! గాయకి చాతుర్యమా'' అంటూ నవ్వాడు. ''పాటకి చాతుర్యమే. ఆ అమ్మాయి రాకపోతే పుట్టింటికి వెళ్లిపోయిఆరునెలలదాకా మీరే మన్నా గడపత్రొక్క కూడదని నిశ్చయించాను''. అన్నది. ''అబ్బో! ప్లాను చాలా దూరం సాగిందే. నిన్ను నాకు దక్క నిచ్చినందుకు పాటకికి హృదయ పూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను'' అన్నాడు. ఇద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

# నిశ్శంక వారష్మాయి

శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి



పార్వతికి పెళ్లి అంటే ఏమిటో తెలిసి అప్పుడే నాలుగేళ్లు కావస్తున్నాయి. ఈ నాలుగేళ్ల జీవితంలోనూ ఆమె అనుకోని మార్పును తనలో చూడకలిగింది. చిన్ననాటి స్నేహితులలో ఆమెకిప్పుడు ఆడ స్నేహితులే మిగిలిపోయారు. మిగిలినవారంతా పెద్ద చదువులకని పట్టణప్రాంతాలకు తరలిపోయారు. వకరూ... యిద్దరూ వాళ్లవృత్తుల్లోకి దిగిపోయి పొట్టకోసం పాటుపడుతున్నారు అవూళ్లోనే. వాళ్లెప్పుడూ తనకు కనబడరు. వాళ్ల పనేమిటో...వారి ఆలోచనయేమిటో వారిదే అంతా. చివరికి మిగిలింది ఒక్క రాము. అతను ఆమెదృకపథంలోనుంచి తప్పించుకుని పోలేకపోయాడు. వూహించకలిగిన పెద్ద కారణం లేకపోయినా అతనిరూపు ఆమెమదిలో అప్పుడప్పుడు మెదులుతూవుంటుంది. చూచి నాలుగేళ్ళయినా మొన్న వేసవికాలపు సెలవుల్లో యింటికి రాగానే వెంటనే గుర్తుపట్టి పలకరించాడు 'పారూ...కులాసాగావుంటున్నావా' అంటూ. అతనిమాటల్లో కొంత వక్రభావంవున్నట్లు పార్వతి మొదట గ్రహించినా అది తనలోపమేనని సర్దుబాటు చేసుకొని వూరుకొంది.

రాము సెలవలయి పోగానే వూరెళ్లిపోయాడు మిగిలి పోయిన చదువును సంపూర్తి చేసికోవటానికి. పార్వతి చదువుచాలించి చాలా కాలం అయింది కాబట్టి యింటి దగ్గరే వుండిపోయింది. మామూలుగానే రాము వెళ్లేరోజున పోతూపోతూ చెప్పి పోవటానికని వీరియింటికి వచ్చాడు. తనతో ఒక్కమాటయినా మాట్లాడకుండా వాకిట నిలబడి అక్కడినుంచే పార్వతి మామయ్యతో మాట్లాడి వెళ్ళిపోయాడు. తను బయటకు రావటానికి సిగ్గుపడింది కొంచెంగా. రాము పార్వతినిగురించి ప్రత్యేకంగా అడగటానికి సాహసించలేక పోయాడు. రైలుబండి కూతలేస్తూపోతూవుంటే పార్వతి మనసులో ఏదో తీయనిబాధ కలిగింది. వ్యక్తపరిచే సావకాశమూ సందర్భమూ లేక తనలోతనే ఆ బాధననుభవించింది ... అంతే చేయకలిగింది.

పదిరోజుల వ్యవధి తరువాత వారింటికి వుత్తరం ఒకటి వచ్చింది. చుట్టూరాకొంచెం పసుపు అంటించి వుంది. మధ్య భాగంలో కొంచెం కుంకుమ ... తపాలు మనిషి వుత్తరం ఈయగానే గబగబా చించి చదివేసింది యింట్లోనుంచి వద్దంటూ తల్లికేకలేస్తున్నా. ఉత్తరంలోవున్న విశేషం ఒక్కటే ... గోపాలం అన్నయ్యకు పెళ్లిసంబంధంవచ్చింది ... కాకినాడ... పాలం పుట్రావున్నావాళ్లు ... పిల్లనాలగవ ఫారం చదువు. — ఆపేసింది ... చదివే వయస్సు వాళ్ళమామ్మ లెక్కప్రకారం దాటిపోవటంవలన. ఆ పిల్ల అన్నయ్యకు నచ్చి ... కట్నం మామయ్యకునచ్చి... వంశగౌరవం అమ్మకునచ్చితే ... యింకేమున్నది అన్నయ్య పెళ్ళి అయిపోతుంది. తన తండ్రి మాట నీడగా జ్ఞాపకంవచ్చి కంటతడి పెట్టింది. వుంటే యిటువండి శుభకార్యంలో ఎంతటి ప్రధానపాత్ర వహించవలసినవాడు ... అన్నయ్య వివాహం అయిపోతే ... యింట్లోవున్నది అన్నాచెల్లెలేగదా ... యింట్లోయిక పెళ్ళి కావలసింది తనే మిగులుతుంది ... తనపెళ్ళి ... సిగ్గు తెరలుముంచుకు రాగానే ఆలోచనను బలవంతంగా తప్పెసుకుని కవరుతో వంటింట్లోకి వెళ్ళింది. తల్లి చదివి 'మామయ్యను పిలుచుకురాపారూ' ... అంటూ ఆదేశించింది.

మామయ్యరాగానే చర్చప్రారంభమయి సమాధానం వకరూపంలోకి వచ్చింది. మామయ్య మద్రాసు వెళ్ళి గోపాలంతో కలసి కాకినాడ వెళ్లేటట్లు ...

అక్కడ పిల్లనుచూచి నచ్చినట్లయితే తరువాత ... మామూలే ...

గోపాలం అన్నయ్య పెళ్ళిపీటలమీద కూర్చుని వుంటే ... పార్వతి మండువా అరుగుమీద కూర్చుని అటువైపు చూస్తూ ఆలోచిస్తోంది. ఆమె మనస్సులో మెదిలే ఆలోచనల్లా పక్కకే ... గోపాలం అన్నయ్య పెళ్ళికాగానే ... తన పెళ్ళిమాట తల పెడతారు ... ఎక్కడెక్కడో వున్న మంచి సంబంధాల జాబితా మామయ్య తయారుచేసుకొస్తాడు. అమ్మ వాటిలో కొన్ని ఏరి వాళ్ళందరికీ కబురు పంపిస్తుంది - ఫలానారోజునవచ్చి పిల్లనుచూచి పోవలసిందని ... అన్నయ్య పెళ్ళిముందు కాబోయే అత్తగారింటి దగ్గరనుంచి పసుపుకవరు వచ్చింది గదూ... అటువంటిది ... ఒకరోజున సంబంధం చూడటానికి వస్తాడు ఎవరయినా ... ఏమిటి ఒకళ్లు నన్ను చూడట మేమిటి? ... నాకు నచ్చటం నచ్చక పోవటం అంటూ ఏమీలేదా ఏమిటి ... ముందర సంబంధం నచ్చితేనే గదా మరికబురు పంపించేది... మామయ్యకు నచ్చందే వాళ్ళను అసలు పిలవడు గదా ... సరే వచ్చిచూచి పోయి 'వుత్తరం రాస్తామంటారు' అంతేగదా మామూలుగా జరుగుతున్నది ... తానువిన్నది ... మళ్ళియింకొకళ్లు వస్తారు ... ... ఏమిటీ సంతలో జంతువును చూచినట్లు ... యింతమంది వచ్చి చూడటానికి వీల్లేదని చెపితే ... తను ఎలా చెపుతుంది. అదికాకపోయి నా నలుగురిని చూస్తేగదా తనకు ఎవరునచ్చిందీ చెప్పటానికి ... నలుగురూ వచ్చి నన్ను చూస్తున్నారని ఎందుకనుకోవాలి ... నేనే నలుగుర్ని పిలిపించి నా యింటి దగ్గర చూస్తున్నానన్నమాట ...

ఒక్కసారి సన్నాయి మేళం బిగ్గరగా 'సీతమ్మ పెళ్ళికూతురాయెనే' అంటూ పల్లవి అందుకోగానే పార్వతి ఆలోచనలోంచి వులిక్కిపడిలేచి ఈ ప్రపంచంలో పడ్డది. ఎదురుకుండా పెళ్ళివాళ్ళంతా హడావుడిగా మాట్లాడుకుంటున్నారు. పిల్లలు అందరి వెనకాలగాచేరి విపరీతంగా అల్లరి చేస్తున్నారు. పురోహితులు సన్నాయి మేళాన్ని లెక్కచెయ్యకుండా మంత్రాలు బిగ్గరగా పఠిస్తున్నారు. గోపాలం అన్నయ్య, ...అన్నయ్యభార్య ... కాదు కాదు అన్నయ్య, వదినా పీటలమీద కూర్చుని అగ్నిహోత్రంలోకి మామిడి ఆకులతో ఆవు నెయ్యివదిలి పెట్టుతున్నారు ... అంతా పెళ్ళిహడావుడి...

పెళ్ళి అయిపోయింది. పెళ్ళికోసం వచ్చిన పెద్దలంతా మూటముల్లె సర్దుకుని వెళ్ళిపోయారు ... అన్నయ్య కాలేజీకి వెళ్ళిపోయాడు పెట్టిన సెలవ పూర్తికాగానే. యింటికి మామూలు మందకొడి వాతావరణం మళ్ళివచ్చి పడింది. పొద్దున్నే లేవగానే కసువు వూడ్చుకోవటం, పాలురాగానే కాఫీ కాయటం, ఆకలివెయ్యగానే అన్నంతినటం...పొద్దు కూకగానే పడుకుని నిద్రపోవటం ... రోజూ యిదే కార్యక్రమం నిర్విఘ్నంగా సాగిపోతోంది. మధ్య మధ్య మామయ్య వచ్చి యింటిస్థితిగతులు విచారించి పోతున్నాడు.

ఒకరోజున వాకిట్లోకి గుర్రంబండి వచ్చి ఆగగానే పార్వతి గబగబా వాకిట్లోకి వెళ్ళిచూచింది. బండివాడు ముందుదిగి కాడిపట్టుకుని 'దిగండి బాబూ...' అంటున్నాడు. వెనకాలనుంచి అరవైఏళ్లు ముసలాయన కర్రనాధారంగాచేసుకొని మెల్లిగా తడవడుతూ దిగాడు. తరవాత ఆయన భార్య కాబోలు ... ముఖానయింత కుంకుమ అదీను ... దిగింది. పక్కనే పదేళ్ళ ఆడపిల్లగూడావుంది. వీళ్ళంతా దిగటం అయిపోగానే ఒకయువకుడుదిగాడు. ఉన్నిలాగూ ... సిల్కుచొక్కా ... టై ... సిలిఅద్దాల కళ్ళజోడు చేతిలోపట్టుకున్నాడు. కాలిబూటుకి కట్టిన తాళ్లు లాగు బయటకు కనబడుతున్నాయి ... నడుముకు బెల్టుపెట్టుకున్నాడు. అన్నీ పరీక్షగా చూడకలిగింది. ... అతని కళ్ళ దగ్గరకు వచ్చేటప్పటికి అతని చిలిపి చిరునవ్వును చూడలేకపోయింది. గబుక్కున వెనక్కు తిరిగింది. మొన్న కాబోలు వాళ్ళమామయ్య ఏదో పసుపుపెట్టిన వుత్తరం పోస్టులో వెయ్యటం చూచింది. యిందుకోసమేనా ... మరీ ఏమిటి యిదంతాను... తనతో ఒక్కమాటయినా చెప్పకుండా ... అత్తా

త్తుగా తన్ను ఆశ్చర్యపరచాలని కాబోలు—వస్రాడు ఎంత అందంగా వున్నాడు ... పైబట్టలకు తోడు అతని ముఖవర్చస్సు తేజరిల్లి పోతోందిగదూ ... తను చూడలేక పోతుంది ... తనునచ్చుతుందో ... నచ్చదో-ఎందుకని నచ్చదు ... పైన మాసిన బట్టలు కట్టుకున్నంత మాత్రాన ... అంత చిన్నవిషయానికి కోపం తెచ్చుకునేటంత మూర్ఖుడు తనకు అక్కర్లేదు అసలు ... అయినా యింతకీ అతను ఆమాటఅంటే గదా ... నిజంగా పెళ్ళిచేసి కుంటాడాతను ... ఆలోచనలు హృదినిండా నింపుకుని బరువుగా యింట్లోకి పోయింది. గబగబా ముఖంరుద్దుకుని చీర మార్చుకుని ముఖానికి స్నోరాసి పౌడరద్దుకుని తల్లి దగ్గరకు వెళ్ళింది వంటింట్లోకి. తల్లి బజ్జీలు వండు తోంది. 'అమ్మా పూరీలు వండరాదటే' అంది. అవి పార్వతికి యిష్టం ... తనకియిష్టమయినవి కాబోయే భర్తకు మాత్రం యిష్టంకావాఏమిటి ... అదీ ఆమెవుద్దేశం ... సావడిలో మామయ్య వాళ్ళ తోమాట్లాడుతూ వుంటాడు. 'ఫలహారం తీసుకురా పారూ!' ... అంటూ కేకవేయగానే వయ్యారంగా నడుస్తూ అక్కడ పెట్టిరావాలి. 'కూర్చోపారూ' అంటాడు మామయ్య ... కాబోయే భర్త ఎదుట ఎట్లాకూర్చునేదీ! ... బలవంతం చేస్తే తప్పదు కాబోలు ... కూర్చున్నప్పటినుంచి తన లావణ్య సంపదకు మురిసిపోయి తనవంకనే చూస్తూ అతను కూర్చుంటే తను అతని కన్నులతో కన్నులుకలసి ఎట్లా చూడగలదు! కనుకొలకులు చిరునగవును చిలక రిస్తుంటే ఏమని పోటీపడి క్రీగంట అతని కనులను పలు కరించేది ... ? ... ఛీ ... ఛీ ... ... అబ్బ ... ఇశ్ ... కాలంగడిచిన కొద్దీ ఆమె అణువణువూ వుద్వేగంతో స్పందించి పోతోంది ... గడచిన క్షణా లన్నీ యుగాల్లాగా కనపడుతున్నాయి. చెమటపట్టిన ముఖాన్ని పదేపదే తుడుచుకుంటోంది. తల్లిలో ఈ షణ్మాత్రంగూడా ఆతురత లేకపోయెటప్పటికి విభ్ర మంచెందింది పార్వతి. తల్లిదగ్గరకు పోయి అమ్మా... యీ బట్టలు బాగున్నాయికదూ ...అంది. తల్లి లేచినిలబడి కౌగిలిలో చేర్చుకుని 'బాగున్నాయమ్మా' అంటూ కంటతడీ పెట్టింది. మాటలోని తొణికిసచూచి తలపైకెత్తింది పార్వతి. కనుకొలకులనుంచి కారు తున్ననీటిబిందువునుచూచి అమ్మా! అంటూ కౌగిలిలోకి యింకా గట్టిగాచేరింది. పార్వతికి తండ్రిమాట జ్ఞాపకం వచ్చింది; తనకి యింకెవరో జ్ఞాపకంవచ్చారు. ఒక్కనిమిషం అలాగే నిలబడిపోయారు తల్లిబిడ్డ లిద్దరూ. తల్లి కళ్ళు తుడుచుకుంటూ పీటమీద కూల బడింది. పార్వతి వుండబట్టలేక పోతోంది. మామయ్య లోపలకు రాడేం ఎంతసేపటికీ ... పెళ్లివారిమాటలు అంత అస్పష్టంగా వినబడుతున్నాయేం ... తలుపు సందులోనుంచి ఓరగా చూచింది. వీధితలుపు ఓర వాకిలిగా వేసివుంది. సావిట్లో మామయ్యలేడు ... వాళ్లులేరు.

పార్వతి హృదయం స్థంభించిపోయింది ఒక్క మారుగా. ఇంతకు మునుపు వచ్చిన వాళ్లంతాఏరీ మామయ్య ఎక్కడి కెళ్లాడు ... బహుశా కాఫీ హోటలుకు తీసుకెళ్లాడేమో ... ఛీఛీ ... యింట్లో ఫలహారం తయారుచేస్తుంటే బజారు కెందుకు తీసుకు పోతాడు .. ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ ఫక్కున నవ్వులు వినబడ్డాయి పక్కభాగంలోనుంచి. చూస్తుండగానే పక్కయింటి అమ్మాయి సుజాత ఫిడేలు వాయిస్తూ పాడటం వినిపించింది ... అమ్మా అంటూ నిలువునా కూలబడిపోయింది ఆలోచనా రహితంగా ...

కాలం గడిచిపోతున్నకొద్దీ ఆమెలో బాధ ఎక్కు వవుతోంది. అప్పుడే పక్కనున్న సుజాతకు పెళ్లి ఖాయమయింది. తన పెళ్లి సంగతి ఎవరూ పట్టించు కోరేం. మామయ్య ఆ మాటే ఎత్తడు. తల్లికి అటు వంటితలపే కగలటంలేదు. ఆ రోజు రాత్రి తల్లి దగ్గరకుపోయి కూర్చుంది. వీధిలో పెళ్లిబాజాలు మోగుతున్నాయి. పూలపల్లకీ దాని వెనకగా పోవటం స్పష్టంగా చూడకలిగింది పార్వతి. అమా యకంగా తల్లివైపు ముఖం తిప్పింది. తల్లి పెదముఖం పెట్టింది పార్వతి ముఖంలోకి సూటిగా చూడలేక. 'అమ్మా సుజాత పెళ్లి ఖాయమయిందటగా. ...

మొన్న వాళ్లు రాలేదమ్మా ... చాలా మంచివా...' తల్లి కొంగు కళ్లకద్దుకుంటుంది. పార్వతి మళ్లీ మాట్లాడలేదు; తండ్రిని తలచుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

తనకు నిద్ర పటుతూ పటుతూ వుండగా మామయ్య వంటింట్లోకి పోవటం చూచింది. తల్లీ, మామయ్యా ఏమిటో రహస్యంగా మాట్లాడుకుంటున్నారు. బహుశా పొలం వ్యవహారాల విషయమే. చిన్నప్పుడు ఏమీ లేని తన కుటుంబానికి ఒక్కసారిగా తన ఆరవఏట యాభై ఎకరాల పొలం వచ్చిందట. ఎందుకు వచ్చిందో ఏమిటో! గొడవ. అప్పటినుంచీ ఆ గొడవే-దాన్ని గురించి సంభాషణలే. ఆ సందర్భమైనదే యిదీ అనుకుని వూరుకున్నా సంభాషణలు అస్పష్టంగా మధ్య మధ్య వినబడుతున్నాయి.

మామయ్య 'పారూ' అంటూ కేక వేసేటప్పటికి వులిక్కి పడినా నిద్రపోతున్నట్లు ఏమీ సమాధానం చెప్పలేదు. సంభాషణ మొదట మామయ్యే అందుకున్నాడు పార్వతి నిద్రపోతున్నదని ఖాయం చేసుకుని.

'పారునిద్ర పోయినట్టుందే...'

'అవునుగాని...ఎంతకాలమని వున్న విషయాన్ని దాయగలంచెప్పు ... అమ్మా! వాళ్ళకి పెళ్ళయింది వీళ్ళకి పెళ్ళయింది అని మధ్య మధ్యవచ్చి అంటూ వుంటూంది ... నాకేమో...'

'సరే నీతో ఎప్పుడూ యింతే ... ఆలోచన కొంచెం దూరంగా వుండాలి ... సరే సంబంధం తీసుకువచ్చి పెళ్లిచేస్తాం ... ఈ యాభై ఎకరాలకూ నీళ్లు వదులుకోవలసిందేకదా ... నేను చెప్పానను కోవటంతప్ప ... ఈ మాత్రపు యోచన నీకు లేకపోతే ఎలాగూ ... ఊ ...'

'డబ్బో ... డబ్బో అని ... యిది కాని ... యివ్వాళ కాకపోతే రేపయినా పెళ్లి చెయ్యక మానేస్తానంటావా...'

'అది సరే నే...జరిగినంతకాలం జరగనీ చూద్దాం.'

'ఏమిటీ చూసేది ... సరిగ్గా కళ్లుగూడ తెరవలేదు ఆ నాటికి ... పసిదాని గొంతుకోసి ...' మాట తడబాటు పార్వతి వినకలిగింది. నిగ్రహించుకో లేక 'అమ్మా' అంటూ పెద్ద పెట్టున గావుకేక పెట్టింది.

'ఏమిటో కలవరిస్తుందికాబోలు ...' అంటూ విసుక్కుంటూ మామయ్య గదిలోకి రాగానే కళ్లు మూసుకుని నిద్రపోతున్నట్లుపడుకుంది. చేతిమీద తట్టిపిలిచినా పలకలేదు.

ఆమె గుండె చెదిరిపోతున్నది. తల్లీ మామయ్య గది బయటకుపోగానే లేచి కూర్చుని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఆ రాత్రంతా ఒకటే ఆలోచన ... నిద్రపట్టే సావకాశం అసలేలేదు. డబ్బుకోసం ఆశించి తనకు అన్యాయం చేస్తున్నారన్నమాట ... తనకింక పెళ్ళి చెయ్యరు ... పెళ్ళి చెయ్యరూ! నోట్లో గుడ్డపెట్టుకుని ఆ రాత్రంతా వెక్కి వెక్కి ఏడ్చింది మాట బయటకు రానీయకుండా.

తెల్లవారేసరికి పార్వతి లేచిపోయిందన్నవార్త వూరంతా గప్పుమని పాకిపోయింది. వారి యింటికి ఎదురుగా పోతూ చావటానికి సిద్ధంగావున్న ఒక ముసలావిడ ముక్కుమీద వేలేసుకుని 'ఇదేం పోయే కాలమో ... నిశ్శంక వారింట్లో యింత అన్యాయం ఎరగనుమ్మా' అంది.

---

# చిఱునవ్వు

శ్రీమతి గుడ్లదొన రాఘవమ్మ



ఈ చిఱునవ్వును గూర్చి వ్రాయాలంటే బోలెడంత గ్రంథమై కూర్చుంటుంది. మహా మహా గ్రంథాల దగ్గరనుంచి చిట్టిచిట్టి పాటలదాక చిఱునవ్వులేనివి లేవనడం అతిశయోక్తి కాదు! అసంభవం కాదు. గ్రంథాలల్లో నాయికా నాయకులకు ఈ చిఱునవ్వు ఒకలక్షణం. నాయకలక్షణం కూడ. ఎక్కడో ఒక చోట కనీసం చిఱునవ్వు నవ్వకుండ ఉండే పాత్రలే అరుదు. నాయకునికంటె నాయిక చిరునవ్వునకు విలువ ఎక్కువ. ఈ చిఱునవ్వు విలువ కొన్ని పాత్రలలో చిల్లిగవ్వ ఖరీదుచేయక పోయినా కొన్ని చోట్లమాత్రం లక్షలు కోట్లుమించి రాజ్యాల ఖరీదు చేస్తుంది. కొన్నిచోట్ల ఈ విలువ విషమించి జీవితాల ఖరీదుకూడా చేస్తుంది. కొన్నిసమయాలలో ఈ చిఱునవ్వు జీవితాలకు జీవితాలనే కొనేస్తుంది.

ఈ చిరునవ్వుకు మొలకనవ్వు, లేత నవ్వు, లేనవ్వు, మందస్మితము, మందహాసము, ఇత్యాదయః, ఎన్నో పేర్లున్నాయి. చిఱునవ్వు కొంచెం మోతాదు మించితే నవ్వు అవుతుంది. ఇంకొంచెం మించితే వెడనవ్వుగా మారుతుంది. అదే అట్టహాసం. అట్టహాసం అనేప్పటికి అసహ్యం, మాడలు పుట్టటం సహజం. స్త్రీ ఎప్పుడు కూడ అట్టహాసం చెయ్యదు, ఒక వేళ చేసేదైతే స్త్రీత్వం పాలు తక్కువగా ఉన్నట్టిదై ఉంటుంది.

మనకవులు ఈ చిరునవ్వును ఎన్ని విధాల నవ్వాలో అన్నివిధాల నవ్వి చూచారు.

మొలక నవ్వులతోడ కలకదేరిన యట్టి
  తరుణిముఖాబ్జంబు తమ్మికేడు - అన్నాడొకకవి,
వెలది నీ చిఱునవ్వు వెన్నెల గనమున్న
  కామాంధ కారంబుగలగు నెట్లు.

ఈ చిఱునవ్వు వెన్నెలగా తోచిందా కాముకుడికి. ఈ వెన్నెల తగిలితేగాని ఆ అంధకారం పటాపంచలుగాదట.

ఇక ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా నవ్వినాడు–'కనుగవ చిన్ననవ్వు దొలకన్ మునినాధుని కన్నుసన్న'–కృష్ణుడు రుక్మిణికి పారిజాతము యిచ్చాడట. ఆ నవ్వులో రాబోయే కాబోయే రసాభాసమంతా యిమిడిఉంది.

"కాలితన్నులు తిన్నా భార్యను కలకదేర్చిన ఘనుడు కృష్ణుడు. ఆత్మహృదయేశ్వరి గన్గొని శౌరి మందహాసాంచిత నేత్రుడై" నాడట. అంత కష్టానికి అది ఫలితం. అంటే చమట తుడిచి వేసుకున్నాడన్నమాట,

రాజసాన్ని చూపించడానికి కూడ తిమ్మన చిఱునవ్వును వినియోగించు

కున్నాడు. కృష్ణుడు దేవతలందరను స్మేరా పాంగ విలోకనక్రియల సంప్రీతాత్ముల జేసి నాడట.

ఇక పెద్దనప్రార్థన దగ్గరనుంచి మొదలు పెట్టినాడు-'అల్లన మేలమాడున చలాత్మజ మాటకు లేతనవ్వు సంధిల్ల'-ఆమేలమాడ టం లేకపోతే ఈ లేతనవ్వు లేదు. ఈనవ్వు లేకపోతే కిరీటికి పాశుపతం లేదు.

భారతమంతా ద్రౌపతి చిరునవ్వు మీదనే ఆధారపడి ఉన్నది. ఆ ద్రౌపది ఆ నాడు దుర్యోధనుణ్ణి చూచి నవ్వకపోతే అసలు భారతకథే అట్లాసమాప్తమయ్యేది కాదేమో.

కృష్ణదేవరాయలు భువనవిజయంలో కూర్చొని కవుల ప్రసంగాలు వినేవాడట. సమస్యలను కవులు పూరించేటప్పుడు వారి కిచ్చే విలువ చిఱునవ్వులతో విలువకట్టే వాడట. ఆయన ఎన్నిమార్లు పెదవివిప్పితే అన్ని పదివేల దీనారాలా కవికి ముట్టేవట. చిఱునవ్వులను లెక్కపెట్టి తిమ్మరుసు డబ్బు పంపిణీ జరిపేవాడట. ఈ విషయం నిజమో కవిపలుకో తెలియదుగాని ఆ సార్వభౌముని చిఱునవ్వుకు ఆ విలువ చాలదేమో.

ఇక నందూరివారి ఎంకి నవ్వేవ్వులకు అంతేలేదు. కన్యాశుల్కంలోని మధురవాణి మందస్మితాలు మనకూ తెలుసు.

కవులవిషయం వదలి స్త్రీలవిషయంలో కొస్తే స్త్రీకి చిఱునవ్వు స్వతహాగా జన్మ లక్షణాలలో ఒకటి. మంచి లక్షణాలలోనే లెక్కవేయవచ్చు. అతిగా నవ్వే స్త్రీని స్త్రీలే అసహ్యించుకుంటారనటం సత్యం వెకిలినవ్వు అంటారు దాన్ని. ఆ నవ్వునవ్వే స్త్రీకి స్త్రీసమాజంలో స్థానమే లేదు-ఉన్నా కట్టకడాపటే.

చిరునవ్వును వెలివితేటలతో విసరా లంటారు. చిరునవ్వు దొంతరలు కమ్ము కొనివస్తేగాని నేటినవలలు పూర్తిగావు. భర్తను లోబరుచుకోడానికి స్త్రీకి బాణం చిరునవ్వు. కష్టించి వచ్చిన భర్తకు బడలిక తీర్చాలంటే చిరునవ్వుతో భార్య ఎదురైతే చాలు. మగవాడికి గాలం ఆ చిరునవ్వు. కాని కన్యలు నవ్వే చిరునవ్వులు వాండ్ల స్వంత కంఠానికి ఒక్కొక్కప్పుడు కత్తెర లవుతుంటవి. ఈ చిరునవ్వులకు పిచ్చెత్తి పోయేమగవాండ్లున్నారు. ఒకపర్యాయం వాండ్లకీ చిరునవ్వు తగిలిందా ఇక సర్వ నాశనమే. స్త్రీ చిరునవ్వును మితంగా ఉపయోగించుకుంటే ఆత్మరక్షణకదిఅవ సరమైన బాణంగా ఉపయోగిస్తుంది అనడం నిర్వివాదం.

లేనినవ్వును తెచ్చుకుంటే అది చిరు నవ్వురూపంలోనే అంతరిస్తుంది. నవ్వు రూపంలోకి దాన్ని తెస్తే అసలు స్వభావం

బయటపడుతుంది. ఒక్కొక్కప్పుడు లేని నవ్వును తెచ్చుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతవి. స్వభావసిద్ధంగా వచ్చేనవ్వును తెచ్చుకుంటే వచ్చిన నవ్వుకు ఎరువు జాకెట్లు తొడుక్కున్నట్లుంటుంది. ఈ లేని నవ్వును తెచ్చుకొని నవ్వడం స్త్రీలకన్న పురుషుల్లో త్వరగా బయటపడిపోతుంది.

కుటిలంగా నవ్వడం — లోపల విషం పెట్టుకొని పైకినవ్వే చిరునవ్వులు యాటం బాంబులకన్నా ఘోరంగా పనిచేస్తవనడం సాహసం కాబోదు.

ఈ చిఱునవ్వుకు మూలం చిన్నబిడ్డలు. మాట్లాడ్డానికి చేతకాకపోయినా నవ్వడం మాత్రం ఏమీ తెలియనిస్థితిలోనే తెలుస్తుంది పసి బిడ్డలకు. ఆ పసిబిడ్డల చిరునవ్వులకోఱకు ఎదురు చూస్తుంటుంది మాతృదేవత బిడ్డ చిరునవ్వు కన్నా ఆనందకర విషయం తల్లికి యింకోటి ఉండబోదు. ఇది అనుభవైకవేద్యంమాత్రమేగాని చెప్పినప్పుడే తెలిసేవిషయం కాదు. పసికందులు పెదాలు విప్పి బోసి నోటితో నవ్వుతారే కాని పెద్దగానవ్వరు. అసలు చిరునవ్వుకి దే ప్రాతిపదిక.

పూలలో పొంగేటి పాలనవ్వులను
నీ వెండిగిన్నెలో నింపి నెమ్మదిగా
మా చిన్నపాపకు మాపు రేపుల్లు
చల్లగా తెచ్చియ్యి చందమామయ్య

అంటారు రాయప్రోలువారు.

ఆ పాలనవ్వులలోని అంతరార్థాన్ని గ్రహించడానికి ఆ తల్లి హృదయానికి మాత్రమే సామర్థ్యముంటుంది. ఇతరులు మాత్రం ఆనందిస్తారు.

'కన్నె వెన్నెల లాలికించు చిన్ననవ్వు ఎట్టుమరతును ననుగన్న చిట్టితండ్రి' అని వాపోయాడు నాళం కృష్ణారావుగారు.



# ప్రసవ వేదనలేకుండా కానుపుకు సోవియట్ పద్ధతులు

డాక్టర్ వి. కులెషోవ్

—— o ——

ప్రసవ వేదనలేకుండా కానుపు ఎలాగ అనే సమస్యను గురించి ప్రపంచంలోని శాస్త్రజ్ఞులు చాల కాలమై ఆలోచిస్తున్నారు. రష్యాలో యీ విషయమై దాదాపు నూరు సంవత్సరాలై పరిశోధనలు జరుగుతూ వచ్చాయి. అయితే యీ సమస్యకు జయప్రదమైన పరిష్కారం యింతకు ముందు శాస్త్రజ్ఞులకు అందుబాటులో లేని కొన్ని అత్యంత ముఖ్య పరిస్థితులవల్ల సాధ్యమైంది. ఇవి, ప్రప్రథమంగా సోవియట్ దేశంలోని పల్లెల్లోనూ, పట్టణాలలోనూ అసంఖ్యాకంగావున్న అన్ని సదుపాయాలతో కూడిన ప్రసూతి గృహాలు, స్త్రీల సలహా కేంద్రాలు వుండడం; రెండవది ప్రసూతి విజ్ఞానశాస్త్ర, స్త్రీ రోగ సంబంధ విజ్ఞానశాస్త్ర సంస్థలతో సహా పరిశోధనా సంస్థలు, ఎక్స్‌పరిమెంటల్ లేబోరెటరీలు చాలా వుండడం.

ప్రసవ వేదనలేకుండా కానుపు రావడానికి సోవియట్ దేశంలోనూ, యితర దేశాలన్నిటిలోనూ బాధా నివారక గుణంగల రకరకాల మందులు వాడడం తెలిసిన విషయమే. కాని వాటిలోని విషపదార్థంవల్లనూ (టాక్సిటీ), యితర కారణాల వల్లనూ అవన్నీ తల్లికీ బిడ్డకీ ఎలాంటి ప్రమాదం లేకుండా ప్రసూతి సమయంలో వుపయోగించడానికి వీలులేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే, మందులిచ్చి కానుపు కష్టంలేకుండా చెయ్యడానికీ, ప్రసవం త్వరగా వచ్చేటట్లు చెయ్యడానికీగల పద్ధతులను పూర్తిగా అవలంబించడం లేదు.

గత అయిదేళ్ళనుండీ సోవియట్ దేశంలో కష్టం లేకుండా కానుపురావడానికి రోగ నిరోధక మానసిక చికిత్సా పద్ధతి (సైకో ప్రోఫిలాక్టిక్ మెథడ్) ఎక్కువగా అవలంబింపబడుతూంది. ఈ పద్ధతి చాల సులువైనది, అద్భుతంగా పనిచేస్తుందికూడా. స్త్రీ రోగ వైద్యులే కాకుండా గ్రామాల్లోని స్త్రీల సలహా కేంద్రాలలోనూ, ప్రసూతి గృహాలలోనూ గల మంత్రసానులుకూడా యీ పద్ధతిలో ప్రావీణ్యం సంపాదించారు.

ప్రసవ వేదనలేకుండా కానుపుకు యీ పద్ధతి ఉన్నత నాడీచైతన్యం సిద్ధాంతంమీద (థియరీ ఆఫ్ హైయ్యర్ నెర్వస్ ఏక్టివిటీ), ఆధారపడివుంది. ఈ పద్ధతిని బోధించడంలో, అత్యంత శక్తివంతమైన ప్రోద్బలకారిగా (ఇరిటెంట్) మాటలకు గొప్ప ప్రాముఖ్యత వుందని నొక్కి చెప్పబడింది. ప్రసవ సమయంలోవున్న స్త్రీకి ఎంతో హాని చెయ్యడానికి బుద్ధి తక్కువగా ఆడే ఒక్క మాట చాలును. మాటలు జాగ్రత్తగ వుపయోగించడం, మంచి శ్రద్ధాసక్తులు, ఉన్నత చికిత్సా విజ్ఞానస్థాయి, మంచి సదుపాయాలు - యివి యీ సందర్భంలో అత్యవసరం. కష్టంలేకుండా కానుపుకు మానసిక చికిత్సా సన్నాహం గర్భవతియొక్క 35-36-వ వారంలో ప్రారంభమవుతుంది. కొంతమందికి కలిపిగాని, వేరు వేరుగా ఒకొక్కరికిని మొత్తం నాలుగు పాఠాలు చెప్పబడతాయి.

మొదటి పాఠంలో, స్త్రీ మర్మావయాల నిర్మాణ స్వరూపం గురించీ, గర్భం ధరించిన కారణంగా తన శరీరంలో కలిగే మార్పుల గురించీ గర్భవతి తెలుసుకుంటుంది; యిదంతాకూడా మామూలుగా ప్రసవించడానికి హామీ యిస్తుందని యీ సందర్భంలో ఉద్ఘాటింపబడుతుంది. కానుపు, కష్టంలేకుండా జరగవలసిన ఒక సహజమైన శరీర కృత్యం. భావిమాతలకు ప్రసవానికి సంబంధించిన మూడు దశల గురించి తెలియజేయబడుతుంది. వాటి ప్రత్యేక లక్ష్యాలు చర్చించబడతాయి; ప్రసవిస్తున్న స్త్రీ మనోభావాల గురించి విశదీకరించబడుతుంది. పురిటి నొప్పులంటే ఏమిటి, అవి ఎంతసేపుంటాయి, అవి పదేపదే ఎంత వ్యవధిలోవస్తాయి అనే విషయాలు స్త్రీలకు తెలియ

జెయ్యబడతాయి. గర్భసంచి, ద్రవాలు చేసేపని గురించి వివరింపబడుతుంది, ప్రసవానికి కొంత శరీర శక్తి అవసరమనీ, అందువల్ల ప్రసవ సమయానికి తన శక్తిని కొంత జాగ్రతగా వుంచుకోవడం స్త్రీకి అతి ముఖ్యమనీ డాక్టర్లు నొక్కి చెబుతారు. దీనిని దృష్టిలో పెట్టుకుని ఆమె ఆహారనియమం పాటించాలనీ, వైద్యసహాయకుల ఆదేశాలను పాటించాలనీ సలహా యివ్వబడుతుంది.

రెండవ పాఠంలో, పురిటి నొప్పులు ప్రారంభమైనప్పుడూ, ప్రసవానికి తొలిదశలోనూ స్త్రీ ఎలా ప్రవర్తించాలో తెలియజెయ్యబడుతుంది. మామూలుగా పురుడు రావడానికీ, నొప్పితగ్గడానికీ ప్రత్యేకమైన శారీరక పద్ధతులన్నీ గర్భిణీ స్త్రీకి తెలియజేయబడతాయి. వారు నిశ్శబ్దంగా పడుకోవాలనీ, ప్రసవ సమయంలో గట్టిగానూ, హెచ్చుతగ్గులు లేకుండానూ ఊపిరి పీల్చాలనీ, ప్రతిసారి ఊపిరితీసినప్పుడు కడుపు దిగువభాగంమీద రెండు చేతుల వేళ్ళతో మెల్లిగా కొట్టాలనీ సలహా యివ్వబడుతుంది; శ్రోణి ప్రదేశంలో త్రికాస్థిపై కోణాలవేపున చర్మాన్ని నొక్కాలనికూడా తెలియజేయబడుతుంది.

భయం, చికాకుపడడం, మూత్రాశయం నిండి వుండడం మొదలైనవి నొప్పిని ఎక్కువచేస్తాయని గర్భిణీ స్త్రీలకు బోధింపబడుతుంది. పురిటిమంచం మీదవున్న స్త్రీ సరిగ్గా ప్రవర్తిస్తే యీ కారణాలు తొలగిపోవచ్చునని నొక్కి చెప్పబడుతుంది.

మూడవ పాఠంలో, పురిటి సమయంలో స్త్రీలు తమ శ్వాసను ఎలా బిగబట్టి వుంచాలో బోధింపబడుతుంది. కష్టమైన పురుడుకి శ్వాసపీల్చి 10-15 సెకండ్లు బిగబట్టి వుంచాలి. వారు సరియైన పద్ధతిలో ఎలా ఊపిరి తీయాలో, బిడ్డతల బయటికి వస్తున్నప్పుడు నొప్పితగ్గడానికి శరీరకండరాలన్నిటినీ ఎలా బిగువు సడలించాలో బోధింపబడుతుంది.

నాల్గవపాఠంలో, ప్రధానంగా ముందుచెప్పిన విషయాలే మళ్ళీ చెప్పబడతాయి. వారికి బోధించిన పద్ధతులు స్త్రీలు నేర్చుకున్నారో లేదో పరీక్షింపబడుతుంది. వారిపద్ధతుల నొకసారి యింటివద్ద ప్రయత్నిస్తే సులువుగా జ్ఞాపకముంటాయి.

కాని యిది ఒక భాగం మాత్రమే. సాధారణంగా గర్భవతులందరూ ప్రసవమంటే భరింపరాని వేదన అనుభవించక తప్పదని భావిస్తారు. తనకు హృద్రోగం, శ్వాసకోశ సంబంధమైన వ్యాధి తదితరమైనవి వుండడంవల్ల ప్రాణాపాయంలేకుండా తాను ప్రసవించగలదా అని భయంతో తరుచు గర్భవతులు డాక్టరును అడుగుతారు.

ఈ విషయంలో డాక్టరుమీద చాల బాధ్యత వుంది. అతను ప్రతి గర్భవతిని పూర్తిగా పరీక్షించి, ఆమె భయాందోళనకుగల కారణాలను తెలుసుకోవాలి, వాటిని నేర్పుతో తొలగించాలి, అంతా సవ్యంగా జరిగిపోతుందని ఆమెకు ధైర్యం వచ్చేటట్టు చెయ్యాలి.

శస్త్రచికిత్స అవసరమైన కేసుల్లో (సన్ననివస్తికము, బిడ్డ తలక్రిందులుకావడం మొదలైన సందర్భాలలో) మాతాశిశువుల ఆరోగ్యం కాపాడడానికి ఆపరేషన్ అవసరమని డాక్టరు జాగ్రతగా బోధపర్చాలి.

కష్టంలేకుండా కానుపురావడానికి వ్యాధిని శోధక మానసిక పద్ధతిని సోవియట్ దేశంలో ప్రయోగించడంలో కలిగిన గొప్ప అనుభవం, నూటికి 76-91 కేసుల్లో అద్భుతమైన సత్ఫలితాలు కలిగాయని తెలియజేస్తూంది. ఈ పద్ధతిని ప్రతిచోటా ప్రయోగించవచ్చును; యిది తల్లికీ, బిడ్డకీ ఏమాత్రం హానిలేనిది. మానసిక వ్యాధిగ్రస్తురాలైన స్త్రీ ప్రసవించిన కేసులో మాత్రమే యిది పనిచెయ్యలేదు.

'టాస్'



# సిరిసిరిమువ్వలు

"ఏం సుబ్బయ్యా! మాకివ్వవలసిన పైకం సంగతి ఏమిచేశావు?"

"కొద్దిగా ఆగండి - యింకా పైకం అందలేదు"

"ఇంకా అందలేదూ! - నిచ్చెనవేసి కోపోయినావా అందడానికి"

♦ ♦ ♦

"బాబూ! నేను పెద్దవాడినైపోయాను- నీవిక యీ వ్యాపారాన్ని చూచుకుంటే నేను విశ్రాంతి తీసికొంటాను"

"వద్దులే నాన్నా! యింకా పాతిక ముప్పై ఏళ్లు నీవే చూచుకుంటే - మన మిద్దరం ఒకేసారి విశ్రాంతి తీసికోడం ప్రారంభించవచ్చు"

♦ ♦ ♦

"కవిగారూ! నాటకంలో నాపాత్ర అభిమానపాత్ర మవుతుందంటారా?"

"ముమ్మాటికి-మీరు తెర ఎత్తంగానే చస్తారు"

♦ ♦ ♦

"ఏమమ్మా! నీ వయస్సెంత? -నీకు సినిమారంగంలో ఎంత కాలమునుండి అనుభవమున్నది?" అడిగాడు డైరెక్టరు.

"నాకాండీ! పద్దెనిమిదేళ్లకు లోపేనండీ - పాతికేళ్లకు పైబడి అనుభవమున్నది"

పిళ్లా సుబ్బారావుశాస్త్రి

---

## సృష్టికర్త

డాక్టరు పాలూరి లక్ష్మీనారాయణగారు

అతి చిన్న జీవినైన యందరి నలరించు, మొగ్గ పుర్వును చేసి మెఱసినావు
చలన హీనములయ్యు చక్కని ఫలపుష్ప, చయము నిచ్చెడు వృక్షసంపదిచ్చి
ప్రాణహీనుండైన భానుని ప్రతిభను, అక్షయంబుగ చేసి అవని బ్రోచి
క్షుద్ర జీవములయ్యు చురుకైన విషముచే, భయపెట్టు వృశ్చిక ఫణులగూర్తు
వారనీదు శక్తి యందునగారడి తలప వినుతి సేయతరమె మాకు
సర్వప్రాణ తతిని సతతంబు నలరించి కాచుదేవ వినుతి కరుణగొనుము.

# సీతమ్మ పశ్చాత్తాపం

శ్రీమతి మునుపల్లె సరోజిని

సీతమ్మ సాలివారి కులంలో పుట్టింది. వాళ్ళు శాన్న భాగ్యవంతులేం కాదు. ఏదో రెక్కాడితేనే డొక్కాడుతుంది. అట్లాగే రెక్కల కష్టంచేసి పిల్లల్ని పెంచారు. సీతమ్మకిద్దరు అన్నలు ఒక తమ్ముడు, ఒక అక్క వున్నారు. అందరిలోకి సీతమ్మ అందంగా వుంటుంది. పసుపు పచ్చని ఛాయ, తీరైన ముక్కు, మొఖం. చెంపకు చేరదేసికళ్లు సన్నగ పొట్టిగ వుంటుంది. సీతమ్మ చక్కదనానికి తోడు పనినేర్పు బాగావుంది. చిన్నప్పటినుండి వార్లుపట్టడం, ఆసుపొయ్యడం, అచ్చులు అతకడం, పడుగుపట్టటం అన్నీ నేర్చుకొంది. నెయ్యడంకూడా వచ్చు. పనిలో నేర్పుంది. చెలాకీతనంవుంది. ఏపనైనా చకచక చేస్తుంది. అందరికి సీతమ్మ అంటే యెక్కువ యిష్టం. కుశాగ్రబుద్ధికూడావుంది.

ఈ తెలివితేటలన్నీ చూసి వాళ్ళ వూళ్లోవున్న వెంకటేశ్వర్ల తల్లి వెంకమ్మ సీతమ్మను తన కొడుక్కు చేసుకుంటానంది. పిల్ల బాగావుంది. పని బాగా వచ్చు. వాళ్లు కట్నం యిచ్చినా యివ్వకపోయినా నష్టంలేదనుకుంది వెంకమ్మ. ఎందుకంటే సీతమ్మ తనకు పనిలో తోడుగా వుంటుంది — ఏదో తమకు రెండెకరాల కాండ్ర వున్నది. దానితో కాలక్షేపం చేయవచ్చును. వెంకమ్మకూడా సామాన్యురాలు కాదు. మరో మనిషి తోడులేకుండా యెన్ని గంటలైనా పొలంలో నాటుగూడ వెయ్యగలదు. కలుపు తీయడంవచ్చు, కోతకొయ్యటం, నాట్లువేయడం మొదలైన పనులన్నీ బాగావచ్చు. అందువల్లనే తన ఒక్క కొడుకు సాయంతో తమ రెండెకరాలు స్వంతంచేస్తున్నది.

సీతమ్మ తండ్రి వెంకటేశ్వర్లుకు తన కూతుర్ని యివ్వడానికి ఒప్పుకున్నాడు. పెండ్లి క్లుప్తంగా అయిపోయింది. సీతమ్మ అత్తవారింటికి వచ్చినప్పటి నుండి అత్తకు అన్ని పనులలోను సాయపడేది. అటు పొలంపని నేర్చుకొని అత్తతో సమానంగా చేసేది. ఇటు పడుగుపట్టటం మొదలైనవిచేసి భర్తకు సాయం చేసేది. ఇవికాక యింటి పనులుకూడ చూచుకొనేది. వాటికి తోడు గేదె దగ్గర పనికూడా చేసేది. ఇన్ని పనులూ సీతమ్మ చెకచెకా, చిలక లాగ చేస్తుంటే యిరుగు పొరుగువారికికూడ చూడ ముచ్చట వేసేది. ఇలాగే కష్టపడి మెల్లగా డబ్బు దాచిపెట్టడం మొదలెట్టారు.

ఇంతలో అత్తగారు వెంకమ్మ కాలంచేసింది. అప్పటినుంచి సీతమ్మ పొలంపని మానివేసేది. ఎప్పుడైనా కోతలకు నాట్లకు మాత్రం పోయేది. ఇంట్లో మగ్గంపని చేయడమే మొదలు పెట్టింది. వాళ్ళు దాచిన డబ్బుతో చిన్నగా గుడ్డల వ్యాపారం మొదలు పెట్టారు. గుడ్డలమ్మటం సీతమ్మ చేసేది. వెంకటేశ్వర్లు మాత్రం గుడ్డలు బస్తీకిపోయి కొనుక్కొచ్చి పడేశేవాడు. ఇలాగే మెల్లగా డబ్బు కూడపెట్టటం మొదలెట్టారు.

## 2

సీతమ్మకిప్పుడొక కొడుకు పుట్టాడు. ఆ పిల్లాడి తరువాత మరల సంతానం కలగలేదు. కొడుక్కి రాముడి పేరు పెట్టుకున్నారు. ఆ ఒక్క కొడుకునీ గారాబంగా పెంచారు. చదువు చెప్పించటం మొదలెట్టారు. కాలు కిందపెట్టనీకుండ గారాబం చేశారు. అయినా చదువులో మాత్రం చకచకా వస్తున్నాడు. కాని డబ్బు మాత్రం జల్సాగా ఖర్చు పెడ్తాడు. ఒక్కడే కొడుకవ్వడంవల్ల వాడ్ని ఏమన డానికీ నోరువచ్చేదికాదు తల్లికి. తండ్రి అప్పుడప్పుడూ కోప్పడేవాడు. ఇంతలో కొడుకు స్కూలు

ఫైనలుకు వచ్చాడు. కానీ యీ పరీక్ష చాల కష్టం అని వూళ్ళోవాళ్ళు అనంగా సీతమ్మ విన్నది. అందుచేత కొడుక్కి మంచి కట్నమిచ్చేవారినిచూచి పెళ్ళిచేయాలనుకున్నారు. సీతమ్మ అన్నకూతురు జానకి నిస్తామన్నారు. ఐదువందల రూపాయల కట్నమిస్తానన్నారు. కానీ సీతమ్మకు యీ కట్నం చాలినట్లు కనిపించలా. అందుకని ఏదో వంకపెట్ట డానికి జానకి తన కొడుక్కి యీడుకాదని తాను 14 ఏళ్ళ పిల్లను తన కొడుక్కి చేసుకోనని చిన్న పిల్లనుచూచి చేసుకుంటామని చెప్పింది.

ఈ మాటకు అన్నగార్కి కోపంవచ్చింది. సీతమ్మకు దగ్గిరబంధువులోనే మరొక అమ్మాయివుంది. తండ్రి చచ్చిపోయాడు. ఆస్థిపాస్తులులేవు. అందుకని కట్నం యివ్వలేముకాని పెండ్లిఖర్చు మేమే భరాయిస్తాం పిల్లను చేసుకోండి, కావలసిన సహాయం చేస్తూవుంటాం అన్నారు. సీతమ్మ ససేమిరా ఒప్పుకో నన్నది. అందుకని వాళ్ళకుకూడ కోపం వచ్చింది. ఇదివరకు అన్నకూతుర్ని చేసుకుంటుందని కాబోలని సీతమ్మ తల్లీ, తండ్రీవచ్చి అన్ని పనులలో సాయపడే వారు. సీతమ్మ లేవలేకపోతే సర్వచాకిరీచేసిపోయే వారు. కాని తమ కొడుకు బిడ్డని చేసుకోనన్నారని తల్లీ, తండ్రి యింటికిరావడంకానీ, మాట్లాడ్డంకానీ మానుకున్నారు. తల్లీ, తండ్రి సాయంలేకపోయేటప్పటికి సీతమ్మకు కష్టంగానేవుంది. అన్ని పనులూ తను చేయవలసిందే. భర్త అంతగా పట్టించుకోడు. కొడుకు యిటు చెంబు అటుకూడా పెట్టడు. ఇంటెడి చాకిరీ తనే చేసుకోవలసి వచ్చింది.

రెండువేలు నిల్వవుండేటప్పటికి సీతమ్మకి తమ పూరిపాకా పడగొట్టి డాబా కట్టించాలని మనసు కలిగింది. భర్త వేరే పెంకుటిల్లు చౌకలో అమ్మకానికి వచ్చింది అది కొందామంటే ససేమిరా మన స్థలం అమ్మేదిలేదు—యిక్కడే డాబా కట్టాలని పట్టు పట్టింది. ఖర్చు తగ్గుతుందని రాళ్ళు, అడుసు తామే మోశారు. అందువల్ల పని మరీ యెక్కువైంది. అటు యింటిపని చూచుకోవాలి. ఇటు, యిటుక, అడుసూ మోయ్యాలి. అటు మగ్గంపని చేయాలిసొచ్చింది. అంతేకాక తామనుకున్నట్లు డాబాకి రెండువేలు చాలలా. అప్పు తీయాల్సివచ్చింది. ఆ అప్పు తీర్చడానికి రాత్రింబవళ్ళు కష్టపడాల్సివచ్చింది. అంతే కాక అటు పిల్లాడి చదువుకు డబ్బు కావాలి. అవి రేషన్ రోజులు. వడ్లు బ్లాకులో ముప్ఫై రూపాయిల పైన అమ్మేవి. అంతేకాక వడ్లుమరకేయించి బియ్యం అమ్మితే అంతకంటె డబ్బు యెక్కువ వచ్చేవి. ఇది లాభసాటిగా కనిపించేసరికి వడ్లు కొనడం, అవి బాగుచేసి మరవేయించడం, బియ్యంచేరిగి అమ్మటం చేస్తూవచ్చారు.

డాబా పూర్తయిం తరువాత గృహప్రవేశం చేసేరు. సీతమ్మ కొడుక్కి పిల్లనిస్తామని ఏలూరు, గుంటూరు మొదలైన బస్తీలనుంచి వచ్చారు. చివరికి ఏలూరువారు వెయ్యిన్నూట పదహార్లు కట్న మిస్తామన్నారు. పిల్లకి పదిహేనువందల రూపాయిలసొమ్ము పెట్టాలన్నారు. సీతమ్మ తన భర్తతో ఆలోచించి యీ సంబంధానికి ఒప్పుకున్నది. తన వీపరాలువారు బస్తీవారు. తన కొడుక్కి అన్ని మర్యాదలు బాగా చేస్తారు. కావాలంటే చదువు కూడా చెప్పించితే చెప్పిస్తారేమో అని తలపోసింది సీతమ్మ.

కాని వెంకటేశ్వర్లు యిదివరకులాగా వుండటం లేదు. చెడ్డసావాసా లెక్కువయినవి. త్రాగుడు ప్రారంభించాడు. ఇంటిపనులలో అంతగా జోక్యం కలుగజేసుకోవటంలా. ఏమంటే పట్టుకుతంతాడో నని సీతమ్మ భయపడేది. ఎలాగోలా కొడుకుకు పెళ్ళి చేసేస్తే కొంతబాధ వదులుతుందనుకొంది.

పెళ్ళికి వాళ్ళ వాళ్ళ నందర్నీ పిలిచింది, కానీ యెవ్వరూ రాలేదు. తన ఆడబిడ్డ, అక్క, అక్క కూతురుతప్ప. సీతమ్మకు నిరుత్సాహం కలిగింది. సరే పెండ్లి కెళ్ళారు. వియ్యంకుడు వ్యాపారస్థుడు కనుక పెద్ద భారీఎత్తున వివాహం చేసాడు. వారి చేతకూడా అలాగే ఖర్చుచేయించాడు. సీతమ్మగారు పెళ్ళికి తీసుకుపోయినవారు తక్కువయినా పెళ్ళి

కూతురుతోపాటు ఒక యాభైమందిదాకా వారింటికి తిరిగివచ్చేటప్పుడు వచ్చారు.

పెళ్ళిలో సొమ్ముకు డబ్బు తీసుకున్నారు వియ్యాలవారు, తామే సొమ్ముచేయించి తెచ్చారు. అక్కడ తూకం అవి అడగడం బాగుండదని సీతమ్మ అడగలేదు. వాళ్లు యిచ్చిన కట్నం కాస్తా అక్కడి మేళాలు, ఊరేగింపులు మొదలైన వాటికి హారతి కర్పూరంలా అయిపోయినై.

గృహప్రవేశానికి యింటికి వచ్చినప్పుడు ఆడపెళ్ళివారి తరుఫున చాలామంది వచ్చారు. వారందరికీ తెల్లవారకముందే కాఫీలు, ఫలహారాలు, భోజనాలు వగైరాలు చేయాలిసివచ్చింది. వచ్చిన పెళ్ళివారు వెళ్తేగా. వెళ్ళమని అడగడం బాగుండదనుకున్నారు. వారంతా పదహారు రోజుల పండగయిందాకాపోలేదు. ఇప్పటికే చాలా ఖర్చయింది. సీతమ్మకు వియ్యాలవారిమీద కోపం యెక్కువయింది. పాపం యేం చేస్తుంది. అంతా దిగమ్రింగింది.

3

కొడుకు స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసయ్యాడు. తరువాత ఎ. ఫే. సీతమ్మగారే చెప్పించుకున్నారు. అదికూడా ప్యాసయ్యాడు. తండ్రి యింక చదువు చెప్పించనన్నాడు. రామానికి కోపం వచ్చింది. అన్నం మానేశాడు. చివరికి సీతమ్మ వియ్యంకుడిని వాళ్ళను బ్రతిమాలి కొడుకును బియ్యేలో చేర్పించింది. ఖర్చులు తామే భరిస్తామని కాని వుద్యోగమైన తరువాత అప్పు తీర్చివేయాలని చెప్పారు. సీతమ్మ కోపాన్ని అణుచుకొని కాలం గడుపుకొస్తున్నది.

రామం బి. ఏ ప్యాసయ్యాడు. ఇంతలో భార్య కాపురానికి వచ్చింది. రామం మామగారు వాళ్ళ వూళ్లోనే వుద్యోగం యిప్పించి కూతుర్ని అక్కడే వుంచుకొన్నాడు. రామం యింటికి చాల తక్కువగ వచ్చేవాడు. వచ్చినప్పుడైనా తన తల్లి తండ్రి మంచి చెడ్డలు చూచేవాడుకాదు. సీతమ్మ దుఃఖానంతా లోపలే దిగమ్రింగేది. కొడుకుతో తన కష్టసుఖాలు చెప్పుకుందామంటే అతనికా గొడవే పట్టేదికాదు.

అంత కంతకు సీతమ్మకు భర్త త్రాగుడు, జూదం యెక్కువయ్యాయి. అతన్ని వారించడం సీతమ్మవల్ల కాలేదు. అదేమంటే కొట్టడానికి చెయ్యెత్తేవాడు. అప్పులుతెచ్చి జూదం ఆడేవాడు. అలా అప్పు కొండలా పెరిగిపోతున్నది. ఇటు యివ్వవలసినవాళ్లు యెగేస్తున్నారు. అదేం అని అడిగే దిక్కులేదు. అలాగ గుడ్డలు అప్పుకు తీసుకొనిపోయి చాలామంది డబ్బు యెగవేశారు.

సీతమ్మకు వయస్సు మరీ ముదరకపోయినా నలభై ఏళ్లకే నడుము వంగింది. వంట్లో శక్తిలేదు. చేసే దిక్కులేదు. అటు గేదె చాకిరీ యిటు మగ్గంపని, గుడ్డల బేరం, యింట్లోపని తానొక్కతె చేయలేదు. ఏమన్నా తిందామన్నా చేసిపెట్టే దిక్కులేదు. తనకు ఓపికలేదు. జ్వరంవచ్చినా చచ్చినట్లు అంతపనీ తానొక్కతే చేసుకోవలసి వచ్చింది. పోనీ తామిద్దరు కొడుకు దగ్గరకు పోదామంటే వాళ్ళ వియ్యంకుడు "మా అమ్మాయి మీ అందరికీ చేయలేదు. అది కాకుండా అందరూ యిక్కడే కూర్చొనితింటే ఆ రెండెకరాలకొంప్ర ఖాళీ అవుతుంది. ఎలాగో కష్టపడి ఆ అప్పు కాస్తా తీర్చివేయండని" అన్నాడు.

సీతమ్మకు తల కొట్టేసినట్లైంది. ఆమె నల్లనిజుట్టు తెల్లగ నెరసిపోయింది. ముఖం ముడతలుపడింది. నడుం వంగింది. వంట్లో ఓపిక తగ్గింది. అప్పుడుకాని తనుచేసిన పొరపాటు అర్థంకాలా. తన అయినవారి సంబంధం చేసుకుంటే యిట్లా జరిగేదేనా! భర్త త్రాగినప్పుడు చీవాట్లుపెట్టి మాన్పించకపోయూరా! తనకు వంట్లో బాగా లేనప్పుడువచ్చి సాయం చేయకుండా వూరుకొనేవారేనా! ప్రతి పనిలో సాయం పట్టివుండేవారు. పెండ్లికికూడ ఖర్చుకాకుండ అప్పులు కాకుండ సుప్తంగా చేసేసేవారు. తనకే బాదరబందీ వుండేదికాదు. అవసరంవస్తే కోడలు యింటిపెడి చాకిరీ చేసేది. తనకు వంట్లో బాగా లేదంటే అటు

కోడలన్నా వచ్చి చేస్తుండేది. లేక యిటు తన అన్నగారు, వదిన, తన తల్లి తండ్రికూడా ఆదుకునేవారు. ఇప్పుడు తన కష్ట సుఖాలువినే ఒక్క ఆప్తురాలుకూడా లేదు. ఇరుగు పొరుగువారుకూడ తిట్టారు. కట్నం ఆశతోటి ఎవ్వరూ ఆప్తుల్ని లేకుండా చేసుకున్నందుకు. సీతమ్మపని అస్తావిస్తంగావుంది. ముందు పోతే గొయ్యి వెనక్కుపోతే నుయ్యిగావుంది. ఆమెకు విచారం యెక్కువయింది. కానీ చేతులు కాలాక ఆకులు పట్టుకొని లాభంఏమిటి? తలచుకొన్నకొద్దీ దుఃఖం పొర్లివస్తోంది. కన్నీళ్లు తుడుచుకొని తన పనిలో నిమగ్నమయేది.

---

# అనురూప ప్రతిఫలము

ఒకానొక పర్వత ప్రదేశమున ఒక స్త్రీ తన చిన్న కుమారునితో నివసించుచుండెను. ఒక దినమున కోపమువచ్చి తల్లి, బిడ్డను గట్టిగా కొట్టెను. అందుమీదట పిల్లవాడు పరుగెత్తికొనిపోయి కొండమీద నిలుచుండి "నీవు నా కిష్టములేదు" "నీవు నా కిష్టములేదు" అని తల్లి నుద్దేశించి బిగ్గరగా అరచెను. వెంటనే యెదుటికొండ నుండి "నీవు నా కిష్టములేదు" "నీవు నా కిష్టములేదు" అన్న ప్రతిధ్వని వినిపించెను ఆ ప్రతిధ్వనిని వినగనే పసివాడు భయపడి గబగబ తల్లియొద్దకువెళ్ళి జరిగిన సంగతిని చెప్పి అమ్మా! "నీవు నా కిష్టములేదు" అని రెట్టించి అరచిన ఆ దుర్మార్గు డెవడు?' అని పెద్దపెట్టున ఏడ్వదొడంగెను.

అపుడు బుద్ధిమంతురాలగు ఆ జనని తన తనయుని వెంటబెట్టుకొని ఆ కొండమీదికివెళ్ళి "అబ్బాయీ! నీ విపుడు "నీవు నా కిష్టము" "నీవు నా కిష్టము" అని కేకవేయుము అని అనెను." అతడు అట్లే చేసెను. వెంటనే "నీవు నా కిష్టము" "నీవు నాకిష్టము" అని ప్రతి శబ్దము శ్రుతిగోచరమయ్యెను.

అపుడు తల్లి తన బిడ్డను చేరదీసి "నాయనా! గ్రహింపుము. నీవేమి యిత్తువో దానినే నీవు పొందెదవు. ఇదియ జీవనసూత్రము" అని నుడివెను.

ఈ సూత్ర రహస్యమును గ్రహించి సమస్త జనులను ప్రేమించుచు, మరల వారినుండి ప్రేమను ప్రతిఫలముగా పొందుచు ప్రపంచమును మనము ప్రేమతో నింపవలయును.

'ధర్మసాధని'

# మనో వేదన

శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ

ఆ నాడు నరసింహానికి జ్వరంతగిలింది. వాడి శరీరము కణకణ కాగి పోతూంది. వంటిమీద చేయివేసి హడలిపోతున్నారు చూచినవాళ్ళు.

వాళ్ళ నాన్నవచ్చి, "ఎలా ఉందయ్యా! నీ వంట్లో" అని చాలా ఆతృతగా అడిగాడు.

వాడు మెల్లిగా కళ్లువిప్పి. "నాన్నా! నాకు పలక పుస్తకం కొనివ్వవూ! నేను చదువుకుంటాను," అన్నాడు.

తండ్రి నోటివెంట జవాబురాకుండానే వాడు మళ్ళి కళ్ళుమూసుకున్నాడు.

అయ్యో! వాడడగగానే, కొన్నైనా యిచ్చేస్తే వాడికీ జ్వరం రాకపోనేమో! అని అనుకుంటూ, ఆయన అక్కే నిలబడినాడు.

మళ్లీ "నాన్నా పుస్తకం పలక కొనివ్వవూ! జాగ్రత్తగా చదువుకుంటాను" అని మళ్లీ పలకరించాడా కుఱ్ఱాడు.

తండ్రి గ్రుడ్లవెంట నీరు తిరిగింది."అలాగేరా నాయనా! తప్పకుండా కొనిస్తాను. జ్వరం తగ్గనీ" మళ్ళీ కళ్ళు మూసుకు పడుకున్నాడు ఆ కుఱ్ఱాడు.

వాళ్ల యింట్లో ఆ పిల్లాడు రెండోవాడు. ఆ తల్లి తండ్రులకు చాలమంది పిల్లలుపోయి, చాలా రోజులకీ కుఱ్ఱాళ్లు బ్రతికారు. అందుచే, వాళ్లకాయింట్లో చాలా గారవ ప్రేమలు లభించేవి.

నరసింహానికి ఐదు సంవత్సరాల వయస్సున అందఱి పిల్లలాగే, బళ్లోకి పంపించారు. వాడు కొంచెం సుకుమారంగల శరీరంగలవాడు. భోజనంలో లోపం వచ్చినా నేలమీద పండుకొనినా, సహించలేకపోయేవాడు. ఏమాత్రం తేడావచ్చినా, వాడికి జ్వరం తగిలేది. వాడు బ్రతికి సంతోషంగా ఉంటేనే చాలునని, ఎప్పటికో చదువుకుంటాడని, వాడి తల్లి తండ్రులు భావించేవారు. అందుచే వాడి చదువుకూడ వానాకాలపు ముసురులాగయింది.

మామూలుగా తోటి పిల్లలతో స్కూలుకు వెళ్లి, ఇంటికి వచ్చేవాడా కుఱ్ఱాడు. కాని, వాడెంతవరకు చదివాడో, వాడికెంతవరకు వచ్చిందో ఎవరు కనుక్కోలేదు. కనుక్కో ప్రయత్నించనూ లేదు.

తండ్రిగారి గౌరవాన్నిబట్టి స్కూలులో గూడ వాడినవేవారుకూడ లేరు. ఉపాధ్యాయులుకూడ వాడిష్టట్ట ముభావంగా చదివినా చదువకపోయినా ఊరుకొనేవారు. ఇలా గడిచిపోయింది వాడికా స్కూలు ప్రాథమిక విద్యాభ్యాస మొదటి

దినాలలో.

ఒకనాడు నరసింహాం స్కూలునుండి యింటికి వస్తున్నాడు. పిల్లలందరు ఇంటికి పోదామనే తొందరకొద్దీ ఒకరి నొకరు త్రోసుకొని తొందరగా వచ్చేస్తున్నారు. ఈ సందట్లో వాడిచేయిజారి పుస్తకం క్రింద పడిపోయింది. వాడి పుస్తకం అదివరకే పాతబడి చిరిగిపోయింది.

ఇంటికి వచ్చాడు. వాళ్లమ్మతో చెప్పాడు. తన పలక పగిలిపోయిందనీ, పుస్తకం చిరిగిపోయిందనీ.

"బడిలోజేరి పట్టుమని పదినెలలైనా గడవలేదు; అప్పుడే అయ్యో పలకలకు పుస్తకాలకీ అంతులేదు" అని కసిరింది వాళ్లమ్మ.

"ఈ వెధవకింకా చదువుకూడ ఎందుకూ! ఏదేనా అంటే ఏడుస్తాడు. ఒక్క అక్షరమేనా వ్రాయడు. ఎందుకు వీడికి చదువూ! పలకలేదు - పుల్లలేదు మూల కూచో వెధవా" అని నాలుగు తిట్టాడు వాళ్ల నాన్న.

నరసింహానికి గ్రుడ్లనీళ్లు తిరిగాయి. "అమ్మా! పదినెలలున్నాయిగాదే! ఇంకా ఎన్నాళ్లుంటాయి" అన్నాడు జాలిగా, వాళ్లనాన్న వెళ్ళిపోయాక వాళ్లమ్మతో.

ఆ కోపంలోకూడ, ఆ మాట కామెకు చిన్న నవ్వొచ్చింది. కాని మళ్లీ కొని యిస్తాననిగాని, ఆమె వానితో నసలేదు మరి కసరనూలేదు. క్రమంగా రెండు, మూడు వారం రోలులుకూడ గడిచాయి. పాపం! ఆ చిన్ని పిల్లాడు, అమాయకంగా అడిగేవాడు వాళ్లమ్మని "అమ్మా! పిల్లలందరూ మంచి పలకలూ పుస్తకాలు తెచ్చుకొంటున్నారమ్మా! నాకు కూడ కొనిపెట్టవూ" అని "ఆదివారంనాడు వెళ్లి కొని తెచ్చు కొందువుగాని నాయనా!" అనేదితల్లి.

ఎన్ని ఆదివారాలో గడిచాయి. అలా అని ఎప్పటికప్పుడు తనని ఓదార్చుతేగాని, తన నెప్పుడూ కొనుక్కోమని వాడిని, వాళ్లమ్మ అన్నపాపాన పోలేదు. వాళ్ల నాన్నకావిషయమే పట్టలేదు వాడికి వాళ్లనాన్న నడగడానికి ధైర్యంలేదు.

ఇలా ఎన్ని వారాలో గడిచాయి. వాడికి నిరాశ నిస్పృహ కలిగింది. కాని అడగడం మాత్రం మానలేదు వాళ్లమ్మని.

చివరకోనాడు హఠాత్తుగా వాడికి జ్వరం తగిలింది. అది శ్రావణమాసారంభం. ఆ వేళ వర్షం మెండుగా కురిసింది. ఆ చిన్న చిన్న చినుకుల్లో వాడలానే బడినుండి ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చేటప్పటికి తల, కొంతవరకు బట్టలు కూడ తడిశాయి. మరో గంటకు విపరీతమైన జ్వరం వచ్చింది.

చుట్టుపట్టు వాళ్లన్నారు "చిన్నపిల్లామ్మా! చితపత చినుకుల్లో తడిసి

ఇంటికి వచ్చాడు. జలుబుచేసింది. మిరియాల కషాయం కొంచెం యివ్వండి. రేపటికి పోతుంది.''

వాళ్లుకూడ అలాగే అనుకొన్నారు. కాని, మరునాటికి ఇంకా ఎక్కువైనదా జ్వరం. కొంచెం పేలాపనకూడ వచ్చింది. ఏదో మందు డాక్టరిచ్చుచున్నాడేగాని రోగలక్షణాలేమీ మళ్ల లేదు.

చూచుటకు వచ్చిన వాళ్లందరూ లోకమాట అనేవారు. ''భయపడినాడేమోనమ్మా పిల్లాడు. అమ్మవారి గుళ్ళో కొంచెం విభూతైనా తెచ్చి పెట్టండి.''

ఎవరేది చెప్పితే; అవి, చాలా చేశారు. కానిరోజురు రోజు ఎక్కువగుటయే కాని, తగ్గుముఖమేమీ లేదు. తండ్రి ముఖంలోగూడ విషాదచ్ఛాయలు గోచరించాయి. అహర్నిశాలు, తల్లి తండ్రులు వాడి మంచం దగ్గరేయుండి, ఏక్షణానికి, వాడికారోగ్యం వస్తుందా అని వెయ్యి దేవుళ్లకు మ్రొక్కుతున్నారు.

హఠాత్తుగా ఒక్కమారు కళ్లుతెరచి, వాడు ''నాన్నా! నాన్నా! పలక పుస్తకం కొనియ్యవూ! ఇంకెప్పుడూ పగలగొట్టుకోను నాన్నా! జాగ్రత్తగా చదువుకుంటాను.''

ఆతృతగా అన్నారాయన, ''నాన్నా! చూడు బాబా! నీకు తప్పకుండా రేపు సాయంకాలానికి పలకపుల్ల తెచ్చిస్తానయ్యా! చూడయ్యా! ఎలాఉంది నీ వంట్లో!''

కళ్లుతెరచి వెంటనే మళ్లీ అడిగాడు వాడు. ''నాన్నా! ఎప్పుడు తెచ్చిపెడతావు నాన్నా!''

కళ్లనీళ్ళు తిరిగాయి వాళ్ళమ్మకి. ''డబ్బులు నీ దగ్గరుంచుకో బాబా! వాడికది కొనిస్తేనేగాని వాడి జ్వరంపోదు.''

వెంటనే నాన్న అందుకొని ''బాబా! ఇవిగో నీ దగ్గఱే ఉంచుకో బాబా ఈ డబ్బులు, నీకు జ్వరం తగ్గగానే కొత్త పలక పుస్తం కొనుక్కొని బడికి వెళ్లుదుగాని'' అని ఆ డబ్బులు వాడి జేబులో వేసారాయన.

పూర్తిగా కళ్లిప్పాడు నరసింహం. ఆ రోజు మొదలుకొని క్రమంగా జ్వరంతగ్గి కోలుకోసాగాడు కుఱ్ఱాడు. నెమ్మదిగా పథ్యం పెట్టారు.

అప్పుడు తెలిసికొన్నారు నరసింహం తల్లీ తండ్రీ ''పిల్లలకేదైనా కావాలన్నది యివ్వకపోతే అది వాళ్ల లేతహృదయాన్నెంతగానో కలచివేస్తుందనీ; అందుచే సదావాళ్ల మనోవికాసాన్ని వృద్ధిపొందించే పరికరాలని కూర్చడం తప్పక ప్రతి తల్లి తండ్రి విధిగా గుర్తించాలని!''



విఖ్యాత బాధానివారిణి

నోపెయిన్ యొక్క

అసమాన శక్తియే దాని ఖ్యాతి

విస్తరించుచున్నది




పెద్ద, చిన్న
ట్యూబులలో దొరకును

కలకత్తా
కెమికల్
కలకత్తా 29

# నోపెయిన్

బాధలను మాన్పును

TEL-1A

"సౌత్ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు 1."

---

పాత్రుడుగారి

# బాలసంజీవిని (Regd)

పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును

## డాక్టరు పిళ్లా సుబ్బయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,

19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు-4. Phone 85254

కుంభకోణము బ్రాంచి : 1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.

# పిడకలగంప

శ్రీ కాపుటూరు వెంకటనారాయణరావు

(గతసంచిక తరువాయి)



"తన భర్త మరణించినా గానీ గుణవతి చింతించలేదట! ఆనాడు, అతనిని చితిమీద చేర్చినపుడుగూడా చింతించలేదట! కన్నీరు గూడా కార్చలేదట! అది వూరివారందరినీ ఆశ్చర్యంలో ముంచివేసింది. గుణవతి "తన భర్త దైవాంశసంభూతుడు. అతనికిమరణంలేదు. నాకు విధవత్వంలేదు. నేను విధవను కానను కున్నదట!"

"గుణవతి వైఖరిచూచి ముత్తయిదువులు అసహ్యించుకున్నారు. విధవన్నారు. ప్రక్కరోజే వారి నోళ్ళన్నీ పడిపోయాయి. తను తెలివితక్కువకు చింతించి నాగేశ్వరునికి మ్రొక్కుకున్నారు. అప్పటి నుండి గుణవతినిగురించి యెవ్వరూ యేమనుకునేవారు గాదు."

"ఆమె అంత పతివ్రత! ఇతర బ్రాహ్మణ పెద్దలు గుణవతి తండ్రిని బెదిరించారు ఆమెను దూరంగా వుంచాలని!"

"గుణవతి, తను పూర్వంలా పసుపు కుంకుమ ముట్టడం మానలేదు. అది చూచి కొందరు ఆమెను చూడడమేమానివేశారు. కొందరు అదిమంచిదిగాదని గుణవతి తండ్రిని మందలించారు. దీనికి వూరి ఆబాల గోపాలం ముక్కుమీద వేలిడారు!"

తలిదండ్రులు యీ అవమానానికి కృంగికృశించారు. గుణవతిని బెదిరించారు. ఆమె ప్రశాంతంగా "నాన్నగారు! నా భర్త తన దేహాన్ని విడిచి దైవంలో కలిసిపోయారు. నాకు అన్యాయంగా మీరు ఆరోపించే విధవత్వం నిజమో కాదో తెలుసుకోవాలనుకుంటే ఆ నాగేశ్వరునే అడగండి" అని బదులు చెప్పింది. దానికి గుణవతి తండ్రి 'నిజమేనా?' అనుకుని నిరూపణకు నిలిచాడు.

"ఆ ప్రక్కరోజే యీ గుడిముందు వూరిప్రజ గుంపుగా చేరింది నాయనా! వింతచూడడానికి అందరూ వచ్చినా గుణవతి వేదయ్యలు మాత్రం రాలేదట."

"గుణవతి తండ్రి యీ చెరువులో స్నానంచేసి శుచై, నాగేశ్వరుని కెదుట నిలబడి యీ అన్యాయమేమిటో తెలియజేయమని ప్రార్థించాడు. గుణవతికి అన్యాయం జరగడం దైవంగూడా సహించలేదు. గుడి గంటలు మారు మ్రోగాయి. గుడినిండా అవ్యక్త ధ్వనులు తాండవించాయి. మహేశ్వరుని మూడవ కన్ను తెరచినట్లు ఆలింగం వారికగుపించింది. అందరూ అతని పాదాల కొరిగి తప్పు క్షమించమని వేడుకున్నారు."

"తండ్రి మనసు, వూరివారి నోరు శాంతించాయి. వేదయ్య తన చెల్లెలు అసామాన్యురాలనుకున్నాడు. ఆమెనే దేవునిలా జాగ్రత్తగా చూస్తూవచ్చాడు."

"గుణవతికి పదునెనిమిదేండ్లు నిండాయి. ఆమె మనసు కామక్రోధాలకు దూరంచేయబడింది. అప్పటి కామె తండ్రికి తొంబయ్యేండ్లు నిండాయి. అతను మంచం పట్టాడు. ఆ సమయంలో తన తండ్రికెంతో సేవచేసింది. గుణవతి. అతను ఆమె ప్రశాంతవదనం లోకి చూస్తూ స్వర్గ ద్వారం చేరుకున్నాడు."

"తల్లి బాధ్యత వారిద్దరిమీద పడింది. వారామెనెంతో జాగ్రత్తతో చూచారు. కానీ ఆమెగూడా త్వరలోనే తనభర్త సాన్నిధ్యంచేరింది. వారిద్దరూ అనాథులయ్యారు. కానీ పెద్దలను సత్కరించడంలో పూజించడంలో యేలోటూ రానివ్వలేదు. గుణవతిని చూచుకుని తన తలి దండ్రుల సంగతి మరచాడు వేదయ్య!"

“గుణవతిని ఒక్క క్షణం గూడా విడిచి వుండలేని వేదయ్యకు అప్పుడప్పుడు యెడబాటు కలిగేది. రాచకార్యాలతో యింటిలో వుండేవాడుగాదు. వూరి వారందరూ గలిసి వేదయ్యకు వివాహంచేసి, మరలా ఓ సంసారమని యేర్పడినందుకు సంతోషించారు.

“కానీ ఆ కోడలి ఆగమనమే యీ ఆడబడుచు అంతర్థానమయింది. ఆమె వీరింటిలో అడుగుపెట్టిన పుడు గుడ్లగూబలు కూశాయంటారు! ఆమాటలతో వూరంతా కలవరపడింది. మరలా గుణవతికి యేదో ముప్పురానున్న దనుకున్నారు.”

“వేదయ్య తన భార్యను గూడా చెల్లెలితో పాటు చూచేవాడు. కానీ గుణవతి పట్ల యే అశ్రద్ధ వహించే వాడుగాదు. ఆమెకు యేదన్నా ముప్పుగలిగితే లోకమే తలక్రిందు లౌతుందని భావించేవాడు. ఇది చూచి ఆమె వదినె సహించలేకపోయింది. ఈర్ష్యతో ఆమె హృదయం దహించుకుపోయింది. గుణవతిని చూచి ఆమె కళ్లు ఓర్చలేకపోయాయి.”

“వేదయ్యకు రాచకార్యాలవల్ల గుణవతిని కని పెట్టివుండను వీలులేకపోయేది. సమయం దొరికినప్పు డల్లా గుణవతిని అష్టకష్టాలు, నానాహింసలు పెట్టేది వదిన. వేదయ్య వూళ్ళోలేని సమయంలో గుణవతిని పస్తుపెట్టేది. కానీ గుణవతి తనకష్టాలను యెవ్వరితో తెలిపేదిగాదు”

“వేదయ్య తన చెల్లెలు సుఖంగావున్నదని తలచే వాడు. అతనున్నప్పుడు ఆమెను వదిన అప్యాయంతో చూస్తున్నట్లు నటించేది. ఆ వదిన గుణవతికన్న యింటిపని మనిషిని ఆప్యాయంతో చూచేది. పని మనిషిచేసే పనులన్నీ గుణవతికి చెప్పేది. అంట్లు తోమడం మొదలు పిడకలేరేవరకు గుణవతే చేసేది. ఆమెకు నాగేశ్వరుని ధ్యానంతో యివేవీ లెక్కకు వచ్చేవిగాదు. కానీ దినదినానికి నీరసించి కృశించ సాగింది. వేదయ్య యిదేమీ గమనించలేదు.”

“ఆనాడు దివాణంనుండి రాచనగరుకు వెంటనే రమ్మని వేదయ్యకు వార్త చేరింది. ఆనాడే గుణవతి బయట జేరింది! భార్యతో చెల్లెలి క్షేమం చెప్పి రాచనగరుకు బయలు దేరాడు వేదయ్య. యెదురుగా యెన్నో అపశకునాలతో అతని మనసు కలత జెందింది. వీటి అర్థమేమిటని యెన్నోవిధాల తలపోశాడు. కానీ రాచకార్యము, రాజాజ్ఞ అయినందువల్ల నేరుగా సాగిపోయాడు. వదిన సమయం దొరికిందని గుణవతిని చేతనయినంతవరకు హింసించింది. ఆ ముట్టు మూడురోజులు తిండికి వాచిపోయింది గుణవతి. చివరకు నీళ్ళయినా దొరికాయిగాదు. స్వతంత్రతకు ఆమె అంటు అడ్డుతగిలింది. ఆకలి దప్పులచేత సొలి పడిపోయింది. తుదకు నోటిలో యింటి యానాది పనిమనిషిచేత నీళ్లు పోయించింది గుణవతికి.”

“నాలుగవరోజు గుణవతికి అతికష్టంమీద స్నానమయింది. తన అన్నకోసం యెదురు చూచింది. అతను అప్పటికీ రాలేదు. నిరాశ చెంది ఆకలికి ఆగలేక, అన్నం పెట్టమని తన వదినను ప్రార్థించింది. కానీ ఆనాడుగూడా ఆమెకు సరిగా తిండిదొరక లేదు. మరురోజు మూరు నీళ్ళతో గుణవతి అంటు తీరిపోయింది. ఆ నాడు ఆ గయ్యాళి వదిన గుణవతి చేతికి గంపయిచ్చి “చెరువుకుపోయి పిడకలు యేరుకు వస్తేగానీ అన్నంపెట్టను” అని బెదరించింది.”

“గుణవతి గంపతీసుకుని యీ చెరువుకు వచ్చింది. గట్టుమీదనిలచి తన అన్నకోసం చూచింది. అతని జాడలేదు. యెలాగో, తను ఆకలితో దహించుకపోతున్నా, నాగేశ్వరుని ధ్యానంతో బుట్టనిండా పిడకలు తెచ్చేటప్పటికి సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు. ఆకలితో సొలి యింటికి వచ్చింది. అప్పటికీ ఆ గయ్యాళివదిన కఠిన హృదయం కొంచమైనా కరుగలేదు. “ఇంకా అన్నంకాలేదు మరోగంప పిడకలు తే” అని ఆజ్ఞాపించింది. గుణవతి నేను పోలేనని ప్రార్థిస్తే రోకలి మొనతో నడినెత్తిన పొడిచింది. “ఆ దెబ్బకు గుణవతి తల బ్రద్దలైంది. నెత్తురు సెలయేరులా ప్రవహించింది. ఆ యెండలో

చెమటగార్చుకుంటూ మరలా చెరువుకు బయలుదేరింది గుణవతి. చేతిలో గంప నిలవడంలేదు. కళ్లు తిరిగి పోతున్నాయి. కాళ్లు తడబడుతున్నాయి. మెల్లగా యీ ఆలయం చేరుకుంది. గుడి తలుపులు యినుప ముద్దలతో బంధించివున్నాయి. ఆ తలుపులముందు వాలిపోయింది గుణవతి. గంపదొర్లి దూరంగా బోర్లపడిపోయింది."

"దూరాన బండియెద్దు గంటల చప్పుడు గణగణ మని మారు మ్రోగుతున్నాయి. తన అన్న తిరిగి వస్తున్నాడు. యెద్దుమెడలోని గంటలమ్రోత వూరి చావిడి సమీపించింది."

"గుణవతి నాగేశ్వరుని ముందుపడి "ఓ దేవా ! యీ కష్టాలు నేభరించలేను. నన్ను నీలో కలుపుకో మని" తల ఆ తలుపులకేసి బాదుకుంది."

"నాగేశ్వరుడు గుణవతిపడే బాధలను చూచి సహించలేకపోయాడు. తన మూడవకన్ను కొద్దిగా తెరిచాడు. గుడి తలుపులు ఫెళఫెళారావాలతో విరిగిపోయాయి. ఆ దివ్యమూర్తినిచూచి గుణవతి కళ్ళుమూసింది. అంతవరకు రుద్రమూర్తిగావున్న నాగేశ్వరుడు ప్రశాంతంగా నాట్యమాడుతున్నాడు. మహేశ్వరుడు తన బాహువులుచాచి గుణవతిని తనలో కలుపుకున్నాడు. మేఘసింహాలు జయ మన్నట్లు ఒక్కసారి గర్జించాయి. మరలా విరిగిన యీ తలుపులు యథా ప్రకారం మూసుకున్నాయి. అక్కడ బోర్లపడిన ఆ పిడకలగంప శిలగామారి పాతాళానికి వేళ్లుపెట్టింది."

"బండి యింటిముందాగింది. వేదయ్యకు యెదు రుగా యెవ్వరూరాలేదు. కంగారుతో, ఆత్రుతతో యింట్లోకి పరిగెత్తాడు. తన చెల్లెలు అగుపించలేదు. భార్యను గద్దించాడు. ఆమె "పిడకలేరుకురాను పంపాను" అని యే అదురు బెదురులేకుండాచెప్పింది. వేదయ్యకు చెమటలుపోశాయి. యెద్దుల నదిలించే కర్రతో భార్యను యిష్టంవచ్చినట్లు బాదాడు. ఆమెకు వేదయ్య ప్రళయకాల రుద్రుడయ్యాడు. "ఛా ! నీకు హృదయమనేదివుంటే ముట్టు మనిషిని పిడకలకు పంపుతావా పని మనుషులు లేక పోయారా" అని చెరువుగట్టుకు పరుగెత్తాడు.

"అప్పటికే ఆలయంలో ఓ శివలింగం పుట్టిందనీ, తెల్లగావుందని తెలిసి వూరివారందరూ, వింతను చూడ డానికి వచ్చారు. వేదయ్యకు చెరువులో చెల్లెలిజాడ అగుపించలేదు. ఆ గుంపు దగ్గరికి పరుగెత్తాడు. శివ లింగంలాంటి ఆ తెల్లనిగుండు అగుపించింది. "చెల్లీ" అని అరచి కలయదిరిగాడు. యేజాడా తెలియక పోయేటప్పటికి చివరకు నాగేశ్వరుని పాదాలు పట్టు కున్నాడు."

"ప్రకృతి భయంకరమైన ధ్వని ఆ సమయంలో వారికి వినిపించింది. ఆ ధ్వని మొదట వారి కవ్యక్త మైంది. తుదకు ఓ ప్రశాంత గంభీర కంఠం అందులో నుండి చొచ్చుకుని "యిక నేను యీ లోకానికి రాను. నా కోసం ఆశపడవద్దు. ఇకమీదట, యీ చెరువునీళ్లు, యీ వూరు బ్రాహ్మణుల కోడళ్లు, యీ వూరి బ్రాహ్మణ కుటుంబాలు రూపనాశనమవు తాయి" అన్న శాపవాక్కులు, వూరివారిని ప్రళ యంలో ముంచివేసింది."

"వేదయ్య తన చెల్లెలు స్వామితో కలిసిపోయిం దని తెలుసుకుని బావురుమన్నాడు. తననూ నీలో కలుపుకోమని నాగేశ్వరుని ముందు తలబాదు కున్నాడు. కానీ యేప్రయోజనం లేకపోయింది."

"అప్పుడే తన భార్య ఆ ఆడబడుచును పెట్టిన కష్టాలన్నీవిని వేదయ్య కన్నీరు విడిచాడు. చేసే దేమీలేక తన భార్యను ఆమె తలిదండ్రులవద్ద వదిలి వేశాడు. ఆ మరునాటిరోజు వేదయ్య యేమయ్యాడో యెవ్వరికీ తెలియదు. అతనుగూడా నత చెలి జాడన నడిచాడనుకున్నారు."

"ఆ ఆడబడుచు శాపవాక్కులకు భయపడి, వూరి బ్రాహ్మణులు అది మొదలు ఒక్కొక్కరే వూరువదిలి వెళ్ళిపోసాగారు. కొందరు నిలిచినప్ప టికి వారి కుటుంబాలు నాశనమయ్యేవి. అది మొదలు వూరి భూముల నన్నిటినీ సస్యశ్యామలం చేయగల ఈ చెరువులో నీటి చుక్కకు కరువైంది. పచ్చని భూము లన్నీ బీడులయ్యాయి. జీవనోపాధిలేక అందరూ వూరువిడిచి వెళ్ళారు."

"అప్పటినుండీ ఆ శిలను "పిడకలగంప" అని పిలిచేవారు. అదే నాయనా! నీవు చూచిన ఆ తెల్ల శివలింగం, ఆమె శాపవాక్యాలు నిజమయ్యాయి. ఈ వూరిలో యిప్పుడుండేది మూడు బ్రాహ్మణ కుటుంబాలే! వారిలో స్వార్థం, యీర్ష్య, వారిని అప్పుడప్పుడు భరించరాని కష్టాలకు దారితీస్తూ వుంటుంది. ఇవిగూడా కొద్ది రోజులపాటే! ఆ పిదప యీ జాతి యిక్కడ పూర్తిగా నశిస్తుంది."

"అప్పటినుండి యీ వూరికి ఆ ఆడబడుచు తల్లిదండ్రుల యింటిపేరు "గ్రిద్దలూరు" అని సార్థకమయింది. అప్పటినుండి వూరికి యేపీడకలుగకుండా నాగేశ్వరునితోపాటు ఆ పిడకల గంపనుగూడా పూజించేవారు. కానీ యిప్పుడు యిక్కడ నాగేశ్వరుని వైభవమే పూర్తిగా తగ్గిపోయింది. ఆ శిల మీద ఒక పుష్పంగూడా వేయలేకపోతున్నాం. కొందరు దుష్టులు ఆ శిలను నిర్లక్ష్యంచేసి పెకలింప జూచారు. మరుక్షణమే నెత్తురుగక్కి నాగేశ్వరుని పాదాలమీద పడిపోయారు,"

"వూరిలో యీ సంగతి తెలిసినవారందరూ, తమ వూరిలోని బ్రాహ్మణుల నాశనానికి ఆ ఆడబడుచు శాపవాక్యాలే నిజమని భావిస్తారు. ఇది నాయనా ఆ పిడకలగంప సంగతి!"

అని అర్చకుడు ఓ వేడి నిట్టూర్పు విడిచాడు. అప్పటికి బాగా చీకటి పడింది. అప్పుడే కృష్ణ పక్షంలో అడుగుబెట్టిన చంద్రుని వెన్నెల చాలా హీనంగావుంది. చెరువులోవున్న కొద్ది నీటిలో చంద్ర బింబం కదులుతుంది. దూరాన గనులలోని విద్యుద్దీప కాంతులు మెరిసి, నక్షత్రాలలో కలిసిపోయాయి. వూరిలో దీపపుబుడ్లు అక్కడక్కడ నీరసించి వున్నాయి. వాటిని, మసక వెన్నెలలోని ఆ మధుర ప్రకృతిని చూస్తూ, అర్చకుడు తెలిపిన సంగతి మనన చేసుకుంటూ, నిట్టూర్పులతో చెరువుకట్టదిగి తన వసతి తట్టునడిచాడు రాజు.




# కొయ్య గుఱ్ఱము

C. A. సురేష్

కొన్ని వేల సంవత్సరములకు పూర్వము ఆసియా మైనరునందు 'ట్రాయ్' మహా నగరముండెడిది. దానికి రాజు 'ప్రియమ్'. అతనికి ఒక కూతురు, ఇద్దరు కొమారులు గలరు. కొమార్తె పేరు 'కసాండ్రా' ఆమె పుట్టినప్పటినుండి జ్యోతిషమునందు ప్రావీణ్యము గలిగి యుండినది. జరుగబోవు దానిని సులభముగ గుర్తించి ముందుగా తెలియపరచెడిది. మొదటి కుమారుడు 'హెక్టారు' అతడు గొప్ప యోధుడు. రణరంగమునందు ఎంతమంది శత్రువులనైనను ఎదుర్కొనగలడు. రెండవ కుమారుడు 'పారిస్' అందరికన్న మిక్కిలి అందమైనవాడు.

పారిస్ పుట్టినప్పుడు అతడు ట్రాయ్ నగరనాశనమునకు కారకుడగునని ఆస్థాన జ్యోతిష్కులు చెప్పిరి. దానికి రాజు భయపడి పారిస్‌ను 'ఈడా' అను కొండలపైన వదలివేయుమని భటులకు ఆజ్ఞాపించెను. దైవవశాత్తున ఆ శిశువును దారినిపోవు ఒక గొల్లవాడు చూచెను. వాడు సంతోషముతో ఆ బిడ్డను పెంచి పెద్దచేసెను.

పారిస్ అన్ని విద్యలలోను ఆరితేరినవాడై, చూచుటకు మిక్కిలి అందగాడైన యువకుడుగా కనబడుచుండుటచేత అందరు అతనిని ప్రేమించుచుండిరి. ప్రతి 5 సంవత్సరములకొకసారి ట్రాయ్ నగరమందు వేడుకలు, ఆటల పోటీలు జరుగుచుండును. ఈసారి 'పారిస్'కూడ ట్రాయ్ నగరమందు జరుగు పోటీలలో పాల్గొనెను. పోటీలలో చాలమంది రాజులను ఓడించి తన ప్రతాపమును అందరికి చూపించెను. అందరును అతనిని 'భేష్' అనిరి. తన యన్నయగు హెక్టారునుగూడ పోటీలలో ఓడించెను. దీనినిచూచి హెక్టారు మిగతా రాజకుమారులును అసూయచెంది పారిస్‌ను చంప నిశ్చయించిరి. అప్పుడు 'కసాండ్రా'వచ్చి పారిస్ వృత్తాంతమునంతయు అందరికి వివరించి చెప్పినది. ఆమె 'పారిస్' తన సోదరుడేనని నిరూ

పించెను.

ఈ మాటలువిన్న రాజునకు, రాణికి కూడ అంతులేని ఆనందము కలిగినది. దానితో 'పారిస్'ను కోటకు తీసుకొని పోయి అక్కడ గొప్ప విందులతోను, ప్రదర్శనములతోను అతనిని సన్మానించిరి. అతడును తన తల్లిదండ్రులనుచూచి ఆనందించెను.

ఇట్లుండ నొకనాడు 'ప్రియమ్' తన చిన్న కుమారుని పిలిచి, "నాయనా! ఒక ముఖ్యమైనపనిగా గ్రీకు దేశమునకు నేను పోవలసియున్నది. నా తరఫున వేరొకరిని దానికిపంప నిశ్చయించితిని; దానికి నీవే సమర్థుడవు. గ్రీకు దేశమునందు ఏనగరమునందైనను నిన్ను గౌరవించెదరు. కావున నీవు వెళ్ళి ఆ పనిని ముగించుకొని జాగ్రత్తగా తిరిగిరావలయును. శుభమగుగాక" అని దీవించెను. పారిస్ తండ్రిమాట ప్రకారము ప్రయాణమునకు సిద్ధపడెను.

మంచి రోజుచూచి పడవను ఒక దానిని సిద్ధపరచుకొని, కావలసిన సామగ్రితో పారిస్ బయలుదేరెను. అప్పుడు తన యక్కయగు 'కసాండ్రా' వచ్చి పారిస్‌తో "గ్రీకు దేశమునుండి నీవు యెవరిని భార్యగా తీసుకొనిరావలదు. అట్లు తెచ్చిన ఆమె మన దేశనాశనమునకు కారకురాలగును" అని చెప్పి పంపెను.

పారిస్ తన పనిని చాకచక్యంతో, త్వరగా ముగించుకొని తిరిగివచ్చునప్పుడు 'స్పార్టా' అను నగరమునందు దిగెను. ఆ నగరరాజగు మెనిలస్ పారిస్‌ను తన అతిథిగా ఆహ్వానించి అతనిని కొన్నాళ్లు 'స్పార్టా'లోనే యుండవలసినదిగా కోరెను. పారిస్ అందులకు సమ్మతించి కొన్నాళ్లు స్పార్టాలోన గడిపెను. స్పార్టా గ్రీకు దేశమునందు మిక్కిలి అందమైన పట్టణము.

మెనిలస్ భార్య 'హెలెన్' మిక్కిలి సౌందర్యవతి. ఆమె యంత యందమైన యువతి గ్రీకు నందెక్కడను ఉండదు. ఎంతోమంది రాజకుమారులు ఆమెపై వ్యామోహముతో పిచ్చివారై పోయిరి. పారిస్ గూడ ఆమెను మొదటిసారిగా చూచినప్పుడే ఆమెను ప్రేమించెను. ఒక నాడు మెనిలస్ స్నేహితులతో వేటకు వెళ్ళెను. అదే సమయమని పారిస్ తన సేవకులను రప్పించి అంతఃపురముననున్న రాణియగు హెలెనును దోచుకొని, తిరిగి చూడకుండ పడవలో ట్రాయ్ నగరము చేరెను.

ట్రాయ్‌నగరమందు పారిస్ హెలెనుతో సౌఖ్యముగా నుండగా మెనిలస్ మోసమును గ్రహించి, గ్రీకుల నందరను కూడగట్టుకొని యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. కొన్నివేల ఓడలతో గ్రీకు సైన్యము బయలుదేరినది. మొదట

గ్రీకులు భయపడినను, మెనిలస్‌కు గలిగిన యవమానమును పోగొట్టుటకై యుద్ధము చేయుటకు సిద్ధపడిరి. గ్రీకుల సేనానాయకుడు 'అచ్చిలస్' అతడు గొప్పయోధుడు. అతనిని ఎవరును, ఏఆయుధముతోను చంప లేరు. అతని కుడికాలియందలి బొటన వ్రేలునకు దెబ్బతగిలిన మాత్రమే అతడు చనిపోవును. ఇది దేవతల వరము.

ట్రాయ్ నగరస్థులను ట్రో జను లందురు. ట్రోజనులీవార్త వినిన వెంటనే యుద్ధసన్నాహములు గావించి యుద్ధము ప్రారంభమాయెను. ఇరుగు పొరుగు రాజ్యముననున్న రాజులందరు సహాయముచేసిరి. ట్రాయ్ నగరముచుట్టును ఆకాశము నంటు కోట గోడలుగలవు. మానవు డెవ్వడును దానిని దాటలేడు. నగరమునకు నాలుగు వైపుల నాలుగు ద్వారములుగలవు. వీనిని భేదించుట కష్టము. "ఏయోధుడు గ్రీకు పడవలనుండి మొదట ట్రాయ్ నగరమునందడుగిడునో అతడు హెక్టారుచే చంపబడున"ని గ్రీకు దేశమందలి గొప్ప జ్యోతిష్కుడు చెప్పెను. ప్రొటెసిలాస్ అను నతడు గ్రీకునందొక నగరరాజు. అతని భార్య 'లోడేమియా' సౌందర్యవతి. ప్రొటెసిలాస్ తన భార్యను, రాజ్యమును ఇతర సుఖములనువదలి ట్రాయ్ నగరమునందు ముందు అడుగిడెను. కావున అతడు హెక్టారుచే చంపబడెను.

అంతకుముందే సిద్ధముగనున్న ట్రోజనులు గ్రీకులను నావలనుండి క్రిందకు దిగకుండచేయుటకు ప్రయత్నించిరి. కాని గ్రీకుల సంఖ్య ఎంతో అధికముగ నున్నందున ట్రోజనులు మెల్లమెల్లగా వెనుదీయసాగిరి. గ్రీకులు సులభముగా ఒడ్డుచేరిరి. గ్రీకుల ధాటికి ట్రోజనులు తట్టుకొనలేక పోయిరి. వారు నగర ప్రాకారము లోపల నుండి గ్రీకులతో పోరాడ మొదలిడిరి. వెలుపలనుండి గ్రీకులకు పోరాడుట కష్టమయ్యెను. ఇటనేక దినములు యుద్ధము సాగినది.

ఏదో కారణమువలన అచ్చిలస్ గ్రీకులతో దెబ్బలాడి తాను యుద్ధముచేయనని భీష్మించి తన గుడారములో కూర్చుండెను. అప్పుడు ట్రోజనులీ సంగతి తెలుసుకొని అచ్చిలస్ లేనికారణమున గ్రీకులను ఘోరముగా ఎదుర్కొనిరి. చాలమంది గ్రీకులు మరణించిరి. ట్రోజనులు గ్రీకుల ఓడలకు నిప్పంటించి చాల తీవ్రముగా శత్రునాశనము గావించిరి. ట్రోజనులకు హెక్టారు సేనాని.

ఈ వార్తవిన్న 'అచ్చిలస్' తనకే ముప్పువచ్చునని తలంచి, తన దేశమును కాపాడుటకు పోరాడ సమకట్టెను. అతనిని చూచిన వెంటనే ట్రోజనులు ప్రాకారములోనికి పారిపోయిరి. పావురముపై గ్రద్దవాలునట్లు అతడు హెక్టారును ఎదు

రొ్కనెను. భయమన్న నెరుగని హెక్టారు మొదటిసారిగా భయపడెను. వారి మధ్య ఎంతో తీవ్రమైన యుద్ధము జరిగెను. అచ్చిలస్ వరప్రసాదుడగుటచే హెక్టారు విసరిన బల్లెము అతనిని ఏమియుచేయలేదు. అచ్చిలస్ ఆవేశముతో తన బల్లెమునుతీసి హెక్టారుపై విసరెను. అది అతని గొంతుకను రెండుగా చీల్చుకొనిపోయెను. తుది ప్రాణముతోనున్న హెక్టారు "ఓరీ! కఠినాత్మా! నీవు నన్ను చంపితివి. జాగ్రత్తగా నుండుము. నీకన్న వీరుడగు పారిస్ యింక త్వరలో నిన్ను యిక్కడే చంపగలడు" అని అనెను. అది వినిపించుకొనకుండ అతడు హెక్టారు శరీరమును తన రథమునకుకట్టి నగరముచుట్టు మూడుమారులుత్రిప్పి తన గుడారమువైపు తీసుకొని వెళ్ళెను, కాని అంతలోనే ట్రోజనులు ఆకళేబరమును విడిపించి నగరములోనికి తీసుకొనిపోయిరి. హెక్టారు వంటి వీరుడు మరణించుటచే ట్రోజనులు చాల భయపడిరి. కాని యుద్ధము మాత్రము ఆగలేదు. సేనానాయకుడు లేకనే ట్రోజనులు యుద్ధముచేయసాగిరి.

అంతఃపురమునందు హెలెనుతో సుఖముగానున్న పారిస్‌కు ఈ సంగతి యేమియు తెలియదు. ఒక సేవకుని మూలముగా అన్న మరణము గురించి తెలుసుకొన్నవాడై కవచమును ధరించి, చేత బల్లెమును తీసుకొని నగరప్రాకారములను దాటి యుద్ధముచేయ మొదలిడెను. అతని ధాటికి యెవరును తాళలేకపోయిరి. అచ్చిలస్ మాత్రము అతనితో పోరుచుండెను. సమయము చూచి పారిస్ తన బల్లెమును అచ్చిలస్ కంఠముపైకి విసరెను. దానిని తప్పించుకొనుటకై అచ్చిలస్ తన గుర్రమును పైకి గెంతించెను. దైవవశాత్తు ఆ బల్లెము సరిగ్గా అచ్చిలస్ కుడికాలి బొటనవ్రేలునకు తగిలెను. అచ్చిలస్ ఆ దెబ్బతో గిలగిల తన్నుకొని పడిపోయెను. దానితో గ్రీకులు వెనుకంజవేయసాగిరి.

ఇట్లనేకదినములు, వారములు, నెలలు ఆ యుద్ధము సాగినది. రోజు, రోజునకు గ్రీకులు తగ్గుచుండిరి. గ్రీకులు ట్రాయ్‌కి వచ్చి సుమారు ఏడుసంవత్సరములయ్యెను. కొన్నాళ్ళకు అందరు మరణింతురని తలంచి కొంతమంది రాజ్యాంగ తంత్రజ్ఞులు ఉపాయముతో ట్రోజనులను జయింపనెంచిరి. గ్రీకు లందరిలో మోసము చేయుటయందు ఆరితేరినవాడు, శకునిని మించినవాడు, 'ఒడిసెస్' అను నతడు.

అతని సలహాపై గ్రీకులు ఒక పన్నాగమును పన్నిరి. ఒక కొయ్య గుర్రమును తయారుచేసి దానిక్రింద చక్రముల నమర్చిరి. అది సుమారు వంద అడుగుల యెత్తుండును. అంత బ్రహ్మాండమైన గుర్రమును బహునేర్పరితనముతో ఆ సముద్రతీరమందు నిర్మించిరి. దాని పొట్టలో సుమారు 2000 మంది కూర్చొనియుండ

వచ్చును. మంచి బలశాలులైన 2000 మంది సైనికులను దాని లోపలనుంచి మిగిలిన గ్రీకులు ఓడలనెక్కి ట్రోజనులకు కనపడకుండ సముద్రముపై ట్రాయ్ కి గ్రీసునకు మధ్యనుండిరి. కొన్నాళ్ళకు పిమ్మట ట్రోజనులు గ్రీకులు లేరని తలంచి నగర ప్రాకారములను దాటి వెలుపలికి వచ్చి చూచిరి. వారికచ్చట ఒక పెద్ద గుర్రము కనబడినది.

కాని యింతవరకు ట్రోజనులంత పెద్ద గుర్రమును చూచి యుండలేదు. దాని ప్రక్కన యొక యువకుడు కూర్చొనియుండెను. అతడు 'ఒడిసెస్' యొక్క నమ్మిన బంటు. అతనిని చూచినవెంటనే వారు ఆ గుర్రమును గురించియు, అతనిని గురించియు అడిగిరి. అప్పుడతడు వారికి నమస్కరించి "నాపేరు 'సినన్' గ్రీకులు నామీద యేదో అనుమానము వలన నన్నిచటనే వదలిపోయిరి. నేను వారిని మీతో సంధి చేసుకొనమని సలహా యిచ్చినందున వారికి నాపై అనుమానము. మూడు రోజులనుండి భోజనముకూడా లేదు. మరణము సమీపించినదని తలంచితిని కాని అంతలో దేవతలవలె మీరును వచ్చితిరి. కావున మీరే గతి" అని అనెను. పిమ్మట వానికి అన్న వస్త్రములిచ్చి వానిని ఆ గుర్రమును గురించి వారు అడిగిరి. అందులకతడు "ఆ గుర్రము దేవతలచే నిర్మింపబడినది. అది యుద్ధమునందు జయించిన మీకు కానుకగా నివ్వబడినది. దీనిని మీ కుల దేవత యగు 'పలాస్ అథెని' (ఒక గొప్పట్రోజను దైవము)కి కానుకగా అర్పించుటకై యిది యిచ్చట వదలివేయబడినది. కావున దీనిని మీరు మీనగరములోనికి తీసుకొనిపోయిన సర్వసంపదలు చేకూరగలవు." అని ఎంతో వినయముతో, నమ్మునట్లు పలికెను. ఆ గుర్రమును తీసుకొని వెళ్లుటకు వారు సింహద్వారమునుకూడా కొంత పగులగొట్టిరి. ఆ పెద్ద గుర్రమును యెంతో కష్టముతో నగరప్రాకారములలోనికి ఈడ్చి, తిన్నగా కోటవద్ద బయలులో నుంచిరి.

బాగుగా చీకటిపడిన పిమ్మట 'సినన్' గుర్రముయొక్క కడుపునందున్న ద్వారమును తెరచెను. అదే సమయమునందు దూరముగా దాగియున్న గ్రీకులును ఒడ్డు చేరిరి. గొప్పయుద్ధము ఆ అర్ధరాత్రియే జరిగెను. రాజైన ప్రియమ్, అతని బంధువులు, మిత్రులు సంతతి యంతయు నాశనము గావింపబడిరి. పారిస్ కూడా ఈ యుద్ధమునందు మరణించెను.

మెనిలస్ హెలెన్‌ను సురక్షితముగా స్పార్టా చేర్చెను. పారిస్ వల్ల ట్రాయ్ అంత అందమైన పట్టణమే నాశనము గావింపబడెను.

---o---

# ప్రత్యుపకారం

శ్రీమతి ఎస్. నాగమణి



రంగయ్య పొరుగూరు వెళ్ళి తిరిగి వస్తున్నాడు. పొలాలగట్ల వెంబడి వస్తూండగా అతనికి ఒక భయంకర దృశ్యం కనిపించింది.

ఒక గరడుపక్షి, ఒక త్రాచుపాము ఘోరంగా దెబ్బలాడుకుంటున్నాయి. గరడుపక్షిని, పాము చుట్టుగాచుట్టేసింది. వెంటనే రంగయ్య చేతిలోకర్రతో పాముని రెండు వేశాడు. పాము ఆ రెండు దెబ్బలు తప్పించుకొని గరడుపక్షిని వదిలేసి పుట్టలోకి వెళ్ళిపోయింది; గరడుపక్షి ఎగిరిపోయింది.

ఇది మూడు నెలల క్రిందటి సంగతి. అదో, మళ్ళీ అదే దారి వెరిబడి రంగయ్య బండిమీద సరుకులు వేసుకు వస్తున్నాడు.

త్రాచుపాము మూడు నెలలయినా రంగయ్యని మరవలేదు. పగబట్టింది. రంగయ్య మాత్రం మరచిపోయి కూని రాగాలు తీసుకుంటూ వస్తున్నాడు.

ఆరోడ్డుమీదవున్న ఒక మఱ్ఱిచెట్టు కొమ్మ అడ్డంగా వాలిపోయివుంది. పాము తనతోకచివర మెలికిపెట్టి ఆ కొమ్మకు వ్రేలాడబడింది. ఆ దారి వెంబడే వస్తున్నాడు రంగయ్య!

రంగయ్య దగ్గరికి రాగానే, గభాలున విసురుగా అతని గుండె దగ్గర్నుంచి ఎగిరిపోయింది గరడుపక్షి.

ఏమిటా అని రంగయ్య తలఎత్తి చూసేవరకు గరడుపక్షి త్రాచుపాముని కాళ్ళతో తన్నుకు ఎగిరిపోతోంది!

ఆ గరడుపక్షే ఆ పాముని తన్నుకుపోకుంటే తనని ఆ పాము కరిచివుండేది!

"దేనికయినా ఉపకారంచేస్తే వూరకేపోదు" అనుకున్నాడు రంగయ్య.




శ్రీ రాజరాజేశ్వరి పిక్చర్సువారు 'శ్రీ కృష్ణతులాభారం' నిర్మిస్తున్నారు. ఇందులో యస్. వరలక్ష్మి, రఘురామయ్య, సూరిబాబు నటిస్తున్నారు. కె. బి. నాగభూషణం దర్శకత్వం వహిస్తున్నారు.

◆ ◆ ◆

భాస్కర్ ప్రొడక్షన్సువారి 'చెడపకురా చెడేవు' అను చిత్రం గత 6-వ తేదిన ఆంధ్రదేశంలో విడుదలైంది. ఎన్. టి. రామారావు, జానకి, అమరనాద్, రేలంగి పాల్గొన్న ఈ చిత్రానికి ప్రొడ్యూసర్ డైరెక్టర్ శ్రీ కె. భాస్కరరావు; సంగీతం ఘంటసాల.

◆ ◆ ◆

అన్నపూర్ణ పిక్చర్సు తరఫున శ్రీ కె. వి. రెడ్డిగారి దర్శకత్వంలో నిర్మించబడిన 'దొంగరాముడు' విడుదలకు సిద్ధంగావుంది, నాగేశ్వరరావు, సావిత్రి సూర్యకాంతం మొదలగు వారీచిత్రంలో నటించారు.

◆ ◆ ◆

సారథి పిక్చర్సువారు, వారి చిత్రం 'రోజులు మారాయి'కి మద్రాసులో 29-6-55 వ తేదిన అర్ధశత దినోత్సవం జరిపారు. జానకి, రేలంగి, వహీదా రహమాన్ యీ మహోత్సవంలో పాల్గొని స్టేజిపై ప్రేక్షకులకు దర్శనమిచ్చారు.

◆ ◆ ◆

విఠల్ ప్రొడక్షన్సువారి 'కన్యాదానం' చిత్రం 14-వ తేదిన విడుదల కాబోతున్నది. దీన్ని విఠల్ అచార్య డైరెక్ట్ చేశారు. కాంతారావు, జానకి, సురభి, బాలసరస్వతి పాల్గొన్నారు.

◆ ◆ ◆

మన ప్రధాని నెహ్రూ రష్యా పర్యటనని ఇండియా డాక్యుమెంటరి ఫిలిమ్సువారు ప్రత్యేకంగా తగిన టెక్నీషియన్సునుపంపి చిత్రంగా తయారు చేసారు. అది ఈ వారంలో భారతదేశం మొత్తంపై 200 థియేటర్లలో విడుదల చేసారు. నిడివి 2000 అడుగులు వుండి, ప్రదర్శనకు 20 నిమిషాలు పడుతుంది.

◆ ◆ ◆

విజయవారు కె. వి. రెడ్డిగారి దర్శకత్వంలో 'శశిరేఖాపరిణయం, శ్రీ బి. యన్. రెడ్డిగారి దర్శకత్వంలో 'లవకుశ' నిర్మిస్తున్నారు. 'లవకుశ'కు కావలసిన స్క్రిప్టు తయారయింది. శశిరేఖాపరిణయంకన్న ముందే విడుదలకాగలదని తెలుస్తోంది.

జెమిని వాసన్ తను నిర్మిస్తున్న హిందీ చిత్రం 'ఇన్సానియత్'లో నటించడానికి హాలీవుడ్ నుంచి 'జిప్పి' అనే గోరిల్లాను తెప్పించారు. అది దినానికి 20 కప్పుల కాఫీ సేవిస్తుందట. 'జిప్పి'కి ఈ చిత్రంలో పాల్గొన్నందుకు లక్ష రూపాయ లిస్తున్నారట జెమిని వారు.

'అర్జున్'

# కలగూరగంప



లక్నో నగరవాసి, ఆంధ్ర నారీమణి శ్రీమతి వంగల వాణీబాయమ్మగారు యాత్రార్థము ఋషీకేశానికి యీ వేసవికాలంలో వెళ్ళినప్పుడు ఆమె గాన కౌశలానికి ప్రసన్నయులై శ్రీ శివానందస్వామిగారు 'సంగీతజ్యోతి' బిరుదు ప్రదానం చేసారు.

  

అంగారక గ్రహంపై భూమిపై నున్నవానిని పోలిన చెట్లు, చేమలు కలవని రష్యన్ శాస్త్రజ్ఞులు నిరూపించారట.

  

జీవకోటిపై రేడియోధార్మిక శక్తి ప్రభావాన్ని మిత్రరాజ్యసమితి ప్రత్యేక మహాసభ కనుగొనేవరకు యాటం, హైడ్రోజన్ బాంబుల పాటవ పరీక్షలు నిషేధించాలని లండనులో సమావేశమయిన 17 దేశాల సోషలిస్టు మహిళా ప్రతినిధులు తీర్మానించారు.

  

గోఖలేహాలులో (మద్రాసు) కుమారి కళావతి నృత్య ప్రదర్శనమునకు జూన్ 26 వ తేదినాడు తమిళ, తెలుగు పత్రికారచయితలు అనేకమంది, సినిమా డైరెక్టర్లు హాజరయినారు. ఈమె భరతనాట్య ప్రావీణ్యాన్ని శ్లాఘిస్తూ ముందుముందు ఉత్తమ శ్రేణికి చెందిన నర్తకిగా రూపొందాలని ఆశీర్వదించారు.

  

మద్రాసు ఆంధ్ర విజ్ఞాన సమితి వారు హిందీ ప్రచార సభ కళామండపంలో శ్రీ కే. వి. రెడ్డిగారి సమక్షమున చింతామణి నాటకమును జూలై 3 తేదిన ప్రదర్శించారు. నటకులు అభ్యుదయ దశలోనివారైనా పాత్రౌచిత్యాన్ని అర్థంచేసుకొని ఎవరికివారు నటించినట్లైతే మరింత బాగుండేది. శ్రీమతి రమాదేవి రాధగాను, శ్రీ ఆర్. శివరామమూర్తి సుబ్బిశెట్టిగా బాగా రక్తికట్టారు. కుమారి రాజేశ్వరి చింతామణిగా మెప్పించలేకపోయింది.

శ్రీ పి. మునుస్వామిగారి సంగీతం హృదయ రంజకంగా నుండింది.

'సి సి'

# స్వీకారము

**గజపతుల నాటి గాథలు (మొదటి భాగము) : శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు. ప్రచురణకర్తలు: బుక్ మన్స్, మద్రాసు 7. వెల రు. 1-0-0.**

ఇందలి కథలు విజయనగర సంస్థానానికి, ప్రభువులకు సంబంధించినవి. గ్రంథకర్త విజయనగర ప్రాంతమువారు కాబట్టి వారికి రూఢిగా తెలిసిన సంఘటనలను, యింకా యితరత్రా సేకరించిన దానిని ఆధారంగా చేసికొని ఉన్నవి ఉన్నట్లుగా వాస్తవికత ఉట్టిపడునట్లు రచించినవి. చారిత్రాత్మక దృష్టిలో చాల అమూల్యమైనవి.

రచయిత అనుభవజ్ఞుడు, పండితుడు అగుటవలన చక్కని శైలిలో యిందలి కథలు రచించబడినవి.

**అమ్మ: 'జయరాం'. ప్రతులకు: బాలసరస్వతీ భాండాగారము, ఆరగొండ (P. O.) చిత్తూరుజిల్లా**

ఇది పద్యరచన. ఇందులో ప్రభుభక్తికి, మాతృప్రేమకు ప్రాధాన్యమిస్తూ అఖండ త్యాగము చేసిన ధన్నా జీవితచరిత్రమును చిన్న చిన్న పద్యములుగా గ్రంథకర్త మనోహరంగా చిత్రించాడు.

గ్రంథకర్త 'మనవి' లో వివరించినట్లు కవితా కుమారి 'బాలిక' యయినా క్రమంగా వన్నెలు చిన్నెలు తీరి సర్వాలంకార శోభితగా నొప్పి గ్రంథకర్త ఉత్తమోత్తమమయిన రచనలు చేస్తారని ఆశిద్దాం!

**పిచ్చితల్లి! కవిశేఖర విశ్వనాథ నరసింహంగారు. ప్రతులకు! వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు - 1. వెల రు. 1-0-0**

గ్రంథకర్త కవి, పండితుడు, విద్యావేత్త. ఈ ఖండకావ్య కవితారీతులను ప్రత్యేకముగా పేర్కొనవలసిన అవసరము అంతగాలేదు-కారణము-యిది పునర్ముద్రణము. మృదుమధుర శైలిలో, భావరసపూరితములైన పదగుంభనముతో రచన సాగిపోతున్నది.

---

# సంపాదకీయములు

## పొదుపు ఉద్యమం

కుటుంబ జీవితంలోని దుబారాను అరికట్టి, దానివల్ల మిగిలే మొత్తాలను నిల్వచేసికోడంతోబాటు అదియ అభ్యుదయ కార్యకలాపాల నిర్వహణకు తోడ్పడటం యీ ఉద్యమంయొక్క ఉద్దేశము.

గృహిణిగా స్త్రీ దుబారాను అరికట్టగలదు. అవసరాల మేరకు ఆదాయమునుగాని, ఆస్తినిగాని వినియోగ పరచుకోవడంలో గృహిణి సహకారము విశేషముగ కుటుంబమునకు వినియోగపడగలదు.

ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో ఏ కొద్ది భాగమో తప్ప జనసామాన్యము నిత్యావసరాలు గడపుకొనుటకే కష్టపడుతుండగా యీ పొదుపు ఉద్యమం ఫలవంతంగా సాగుటకు వారు చేయ కలిగినది అంతగా లేకపోయినా అవకాశమున్న ప్రతి కుటుంబము యీ వుద్యమమును విజయవంతం చేయవలసియున్నది.

దేశాభ్యుదయాన్ని ఉద్దేశించి యీ ఉద్యమం దేశవ్యాప్తంగా మహిళల సహకారమును పొందకలుగాలి. తాము నిల్వచేసి ప్రభుత్వమునకు పెట్టుబడి పెట్టుటవలన తమ సొమ్ముకు భద్రత, దానిపై ఆదాయంతో పాటు జాతీయాభ్యుదయ ప్రణాళికల నిర్వహణకు మహిళలు యిత్లోధికంగా తోడ్పడినవారగుదురు.

ఉ ఉద్యమం, పల్లెలలోను, పట్టణములలోను విస్తరించి, దాని ఉద్దేశలక్ష్యాలు బాగా ప్రచారమయి త్వరితగతిన శ్రేయోరాజ్య స్థాపనకు అవకాశాలు కలుగునని ఆశిద్దాం! ఇందుకుగాను ముఖ్యంగా మహిళలు ముందంజ వేయగలరని మా నమ్మకం.

## పురపాలక సంఘాలలో స్త్రీలు

పురపాలక సంఘాలలో పరిపాలనా నిర్వహణ బాధ్యతలను మహిళలకుకూడ పంచడానికి, వారికి ప్రాతినిధ్యము కల్పించడానికనువుగా ఆంధ్ర ప్రభుత్వము చట్టరీత్యా వసతులు కల్పించనున్నదని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు వెల్లడిచేశారు. దానిపట్ల మహిళాలోకం హర్షామోదాలు వెల్లడించియుంటుంది.

ఎన్నికలల్లో జయముగాంచికాని, లేదా 'కోవాప్టు' చేసికోబడిగాని సభ్యులైన మహిళల శక్తిసామర్థ్యాలు విద్యాది యోగ్యతలు పరిపాలనా నిర్వహణ కుపకరించేవిగా నుండాలి.

పంచాయతి బోర్డులు, మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులాంటి ప్రజాప్రతినిధుల సంస్థలు విద్యాది యోగ్యతలు గల ఉత్తమ ప్రతినిధులు ఎన్నిక కాకపోవడంవలన వాని నిర్వహణ ఎంతటి ఒడిదుడుకులతో సాగుచున్నదో యీ నాడు చూస్తూనే యున్నాము.

ఈ సంస్థల నిర్వహణలో బాలబాలికల విద్య, ఆరోగ్యవసతుల విస్తరణ, విజ్ఞాన వినోదాలవ్యాప్తి, కుటుంబ ఆదాయం పెరుగడానికిగల అవకాశములు-లాంటి సాంఘిక సంక్షేమ సంబంధ సమస్యల పరిష్కారంలో మహిళా ప్రతినిధులు ఎంతైనా తోడ్పడడానికి అవకాశములున్నవి. దానిని తోడిసభ్యులు (పురుషులు) గుర్తించి పరస్పర సహకారంతో కృషిచేసినచో జాతీయ జీవితము సౌభాగ్యవంతము కాగలదు.



# శ్రీ మన్మథనామ సం॥ ర ఆషాఢ, శ్రావణమాసములు

1955 సం॥ జూలై

| | | |
|---|---|---|
| 16 | శ | ద్వా 46-30 రో 43-53 రా 24-49 దక్షిణాయన పుణ్యకాలః |
| 17 | ఆ | త్ర 39-43 మృ 39-16 రా 26-48 |
| 18 | సో | చ 33-20 ఆర్ద్రా 34 54 మాసశివరాత్రిః |
| 19 | మం | అమా 28-24 పున 31-0 దివి 2-52 |
| | | **శ్రావణమాసము** |
| 20 | బు | శుద్ధపాడ్యమి 22-13 పుష్య 28-52 రా 26-48 తిథి ద్వయం |
| 21 | గు | వి 18-56 అశ్రే 25-38 త్యా 3-56 |
| 22 | శు | త 14-45 మ 24-31 రా 12-39 నాగచతుర్థి |
| 23 | శ | చ 12-43 పూఫ 24 34 త్యా 4-5 |
| 24 | ఆ | పం 11-56 ఉఫ 25-50 రా 15-50 |
| 25 | సో | ష 12 22 హ 28-18 రా 17-40 |
| 26 | మం | స 13-58 చి 31-52 రా 15-7 మంగళగౌరీవ్రతారంభః |
| 27 | బు | అ 16-34 స్వా 36-23 రా 19-51 |
| 28 | గు | న 20-2 విశా 41-39 రా 20-49 |
| 29 | శు | ద 24-6 అనూ 47-25 త్యాజ్యాభావః - వరలక్ష్మీవ్రతం |
| 30 | శ | ఏ 28-23 జ్యే 53-26 ది 2-41 |
| 31 | ఆ | ద్వా 33-0 మూ 59-25 దివి 15-19 |

1955 సం॥ ఆగస్టు

| | | |
|---|---|---|
| 1 | సో | త్ర, 37-13 పూషా 60-10 ది 25-37 |
| 2 | మం | చతు 41-3 పూషా 5-0 త్యా 4-21 |
| 3 | బు | ○ పౌ. 44-8 ఉషా 10-3 ది 20-47 సర్వయజుర్వేదనాం ఉపాకర్మ |
| 4 | గు | బ పాడ్యమి 46 17 శ్ర 14-17 ది 24-51 |
| 5 | శు | వి 47-19 ధని 17-33 త్యా 4-9 |
| 6 | శ | త 47-9 శత 19-40 రా 4-22 |
| 7 | ఆ | చ 45-39 పూభా 20-33 రా 17-58 |
| 8 | సో | పం 42-57 ఉభా 20-13 త్యా 3-54 |
| 9 | మం | ష 39-6 రేవ 18-44 అహః 31-29 త్యాజ్యాభావః |
| 10 | బు | స 34-16 అశ్వ 16-20 త్యా 3-51 శ్రీకృష్ణాష్టమి |
| 11 | గు | అ 28-39 భ 12-49 రా 9-25 |
| 12 | శు | న 22-26 కృ 8-44 త్యా 3-42 తిథిద్వయం |
| 13 | శ | ద 15-54 రో 4-16 దివి 17-11 |
| 14 | ఆ | ఏ 9-29 ఆర్ద్రా 55-5 ది 18-55 |
| 15 | సో | ద్వా 2-56 ఏప్యం 53-53 పున 51-2 దివి 22-58 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

